కర్నూలు, ఉస్మానియాకళాశాల తెలుఁగు భాషాసమితి

ప్రచురణము - 1.

# రామకృష్ణుని రచనావైఖరి

( విస్తృతోపన్యాసములు 1957-58 )







ఉపన్యాసకులు :

సరస్వతీపుత్ర శ్రీమాన్

పుట్టపర్తి నారాయణాచార్యులు

# నివేదనము



ఉస్మానియా కళాశాల తెలుఁగు భాషాసమితి ప్రతి సంవత్సరము జరుపు సంస్కృతి మహోత్సవములు కర్నూలు పురమునకు తిరునాళ్లు. తెలుఁగునాటి నాలుగు చెఱఁగుల నుండి యేతెంచు మహామహుల యుపన్యాసములు పున్నమ వెన్నెలవోలె నొకనాఁటి పండువు లగుచున్నవేయని పురజనులు, కళాశాల ఉపాధ్యాయ విద్యార్థిబృందములు పలుమఱు తమ చింతను వెలిబుచ్చిరి. ఈ కొఱఁత దీఱునట్లు ప్రముఖుల యుపన్యాసములు ముద్రించి వానికి శాశ్వత రూప మీయవలయునని మా తెలుఁగు భాషాసమితి యభిలషించినది. విశ్వవిద్యాలయము పక్షమున విస్తృతోపన్యాసములు ఇప్పించు వాడుక ఈ నడుమ వెనుకబట్టె సందున ఆలోపమును దీనిమూలమునఁ దీర్పఁగూడునని భావించితిమి.

ఆ ప్రణాళిక ననుసరించి నేఁడు ఉస్మానియా విశ్వవిద్యాల యాంధ్రాచార్యులు డాక్టరు దివాకర్ల వెంకటావధానిగారు "ఆముక్తమాల్యద"పై మూఁడు విస్తృతోపన్యాసముల నొసఁగిరి. ఈ సంవత్సరము నవంబరు మాసమున సరస్వతీ పుత్ర శ్రీ పుట్టపర్తి నారాయణాచార్యులుగారు "తెనాలిరామకృష్ణుని కవిత"పై మూఁడు విస్తృతోపన్యాసములు దయచేసిరి. శ్రీ అవధానిగారు తమ ఉపన్యాసముల లిఖిత ప్రతులను ఇంకను ప్రసాదింపనందున అవిప్ర

చరించుట సాధ్యముకాదయ్యెను. శ్రీ నారాయణాచార్యులు గారి మూడుపన్యాసములును ఈ సంపుటమున ముద్రింపఁబడినవి.

ఉపన్యాసముల నొసఁగిన శ్రీ పుట్టపర్తి నారాయణాచార్యుల వారికిని, మా ప్రయత్నమున కెంతయో ప్రోత్సాహము నిచ్చిన కళాశాలపాలక వర్గమునకును కర్నూలుపుర జనులకును మాకృతజ్ఞతాంజలులు. ఆంధ్రమహాజనులు దీనిని యథోచితముగ నాదరింపఁగలరని అభ్యర్థించుచున్నాము.

సంపాదక వర్గము.

# పీఠిక

—:o:—

ఉస్మానియా కళాశాలాధికారుల యౌదార్యమును ఆంధ్రాధ్యాపకుల యభిమానమును నాచే నీ యుపన్యాసములను జేయించినవి. విద్యార్థుల యుత్సాహముగూడ నా ప్రయత్నమునకు దోహదము. ఈ పరిశ్రమతో ముఖ్యముగ ధన్యుడనైనది నేనే.

వీనిని వ్రాయుటలో శక్తిలోను - శ్రద్ధలోను లోపమెంతయో గలదు. తెన్నాలి రామలింగని ప్రతిభను సమగ్రముగ దూచు యోగ్యత నావంటివానికి లేదనుటలో నాశ్చర్యములేదు. ఇప్పుడు నేను జేసిన పనియంతయు భావి విమర్శకుల కొక పూర్వరంగమును దయారుచేయుటయే.

ఈ యుపన్యాసములను సిద్ధమొనర్చుటలో మిత్రుఁడు శ్రీ 'రాచమల్లు'-శిష్యప్రాయుఁడు 'కర్రా సుబ్రహ్మణ్యము'ను ఎంతయో శ్రమపడిరి. వారికి నా యాశీర్వాదములు.

ఈ యుపన్యాసములలోని గుణదోషములకు రసికులు ప్రమాణము.

పుట్టపర్తి

# తెలుఁగు భాషా సమితి కార్యవర్గము:



ఖాన్ బహదూర్ మౌల్వీమహమ్మద్ సాహెబ్, అధ్యక్షులు,

శ్రీ మే. దీ. వెంకటసుబ్బయ్య, ఉపాధ్యక్షులు,

శ్రీ సి. వి. రమణారెడ్డి కార్యదర్శి,

శ్రీ ఐ. స్వామి. }
శ్రీ పి. వి. ధర్మారెడ్డి. } సహాయకార్యదర్శులు

| | | |
|---|---|---|
| శ్రీ ఎం. వి. సుబ్బారెడ్డి. | | ప్రతినిధులు. |
| శ్రీ బి. కొండారెడ్డి. | ... | ,, |
| శ్రీ కె. వీరన్న. | ... | ,, |
| శ్రీ వి. శ్రీరాములు. | ... | ,, |
| శ్రీ బి. గుండయ్య. | ... | ,, |
| శ్రీ పి. సి. వి. సుబ్బారెడ్డి. | ... | ,, |
| శ్రీ డి. పెద్దారెడ్డి | ... | ,, |
| శ్రీ బి. మద్దులేటి. | ... | ,, |
| శ్రీ ఎస్. సుధాకరరెడ్డి. | ... | ,, |
| శ్రీ ఎన్. లక్ష్మీకాంతారెడ్డి. | ... | ,, |
| శ్రీ ఎల్. వేణుగోపాలరావు. | ... | ,, |
| శ్రీ ఎ. శ్రీనివాసాచార్లు | ... | ,, |
| శ్రీ ఎస్. అబ్దుల్ మునాఫ్. | ... | ,, |
| శ్రీ ఎ. వెంకటరత్నము. | ... | ,, |
| కుమారి పి. కాంతమ్మ. | ... | ,, |
| కుమారి గ్రేస్. దయామణి | ... | ,, |
| కుమారి సి. శేషమ్మ. | ... | ,, |
| కుమారి పి. కుసుమ. | ... | ,, |

# * సంపాదకవర్గము *



శ్రీ మే. దీ. వెంకటసుబ్బయ్య ఎం. ఏ; బి. యిడి.,

శ్రీ బి. వెంకోబారావు ఎం. ఏ; బి. టి.,

శ్రీ ఎం. వి. యస్. సూర్యనారాయణ ఎం. ఏ; బి. టి.,

శ్రీ మహమ్మద్ కాసిమ్ ఎం. ఏ.,

శ్రీ షేక్. మస్తాన్.

శ్రీ డి. వి. సుబ్బాశాస్త్రి



తెలుగుభాషాసమితి కార్యవర్గము - ఉపన్యాసకులతో

# తెనాలిరామకృష్ణుఁడు

రామకృష్ణుని గుఱించి చెప్పఁదలఁచినవారికి మొట్ట మొదట యెదుటనిలచు సమస్యయొకటి. అది–రామలింగఁడు–రామకృష్ణుఁడు_వీరిరువురు భిన్నులా? లేక యొకరేనా? అను ప్రశ్న. రామకృష్ణుని పేరిట మనకు నికరముగ రెండు 'మాహాత్మ్యములు' దొరకినవి. ఒకటి 'ఘటికాచల మాహాత్మ్యము'; 'పాండురంగమాహాత్మ్యము' రెండవది. రామలింగఁడు వ్రాసిన కావ్యము– 'ఉద్భటారాధ్యచరిత్రము.' ప్రసిద్ధులైన వేటూరి ప్రభాకరశాస్త్రులుగారు– తెన్నాలిరామకృష్ణుని విషయమున తలస్పర్శముగఁ బరిశోధించిరి. వారు– వారిద్దఱొక్కరేయని తేల్చివేసినారు. ఇది– మనకష్టమును గొంత తొలఁగించినది. ప్రభాకరశాస్త్రిగారి నిర్ణయము యొక్క పిండితార్థమిది. "రామకృష్ణుఁడనియు– రామలింగఁడనియు పేరులో భేదము లున్నను– వారి కులగోత్రము లొక్కటే! తల్లిదండ్రుల పేరులు గూడ సమానముగ నున్నవి. కావ్యము లందును సాదృశ్యములు మెండు. అందుచే వీరిరువు రభిన్నులే!"

మఱి_ రామలింగఁడు_ రామకృష్ణుఁడెందుకైనాఁడు? తెన్నాలి రామలింగని గురువు యేలేశ్వరుఁడు. రామకృష్ణునకు– భట్టరు చిక్కాచార్యులు గురువు. అగుటచే రామలింగఁడు– రామకృష్ణుఁడగుటకుఁ గారణము స్పష్టముగఁ గని

పించు చున్నది. రామకృష్ణుడు జన్మము చేత శైవుడు. అతని తండ్రి 'సహజ శైవాచారసంపన్నుడు.' తెన్నాలి లోని రామలింగేశ్వర స్వామిపై నాతనికి భక్తి ప్రపత్తులు. అందుచే నాదేవుని జ్ఞాపకార్థమై- మొదట కొడుకును- 'రామయ్య రామలింగడ' నిపిలచెను. ఆరాధ్యుడైన యేలేశ్వరుడే- రామలింగనికి గురువైనాడు. కవి యపుడు 'కుమార భారతి' గ రచించినదే-'యుద్భటారాధ్య చరిత్రము.' తరువాత-వయసులో- రామలింగడు- వైష్ణవమునకు దిరిగెను. నాటియారవీటి రాజులు- వీర వైష్ణవులు. వేషముతో బాటు- పేరుగూడ మారినది. భట్టరు చిక్కా-చార్యులు- పంచసంస్కారముద్రలు జేసినారు. నాటిరచనలే- విష్ణుపారమ్యమును బోధించు-పై రెండు గ్రంథములు. తెనాలి రామభద్రకవి రచించిన ''యిందుమతీ పరిణయము' లోని- కవివంశవర్ణనము- పైవిషయమునే సూచించు చున్నది. అన్నయ కవి రచియించిన 'సుదక్షిణా పరిణయము' నందలి పీఠికను బట్టియుం దేలునదీవిషయమే! జనశ్రుతిగూడ రామలింగడు- రామకృష్ణుడు- ఒక్కరేయనుచున్నది. ఒక రామలింగనితోనే మనము బాధపడుచుండగా- చాలనందుకు- మఱియొక- రామలింగ కవి దయార్థైనాడు. ఆధీరుడు- 'ధీరజన మనోరంజనమును' వ్రాసెనట! కాని మన యదృష్టము బాగుండుటచే- నాతడు విశ్వకర్మ వంశ్యుడై- మనపని కడ్డురాకుండ - దయబెట్టినాడు. తెన్నాలి కవివని మరిరెండు కావ్యములున్నవి. వానిలో నొకటి- 'హరిలీలావిలాసము' దీనిపేరులోనే వైష్ణవ వాసన యున్నది. కనుక రామలింగడు- రామకృష్ణుడుగ

రూపాంతరము నొందిన తరువాతనే- దీనిని వ్రాసెనని సరి పెట్టుకొనవచ్చును ఇఁక మిగిలినది 'కందర్పకేతువిలాసము.' దీనిపేరే పెద్దచిక్కు. ఇందులోని కథ యేమో మన మెఱుఁగము. రామలింగఁడటు శైవుఁడుగాక- యిటు వైష్ణవుఁడుగాక మరియు యుండిన మూఁడవ యవతారమున- దీనిని వ్రాసి యుండునని నాయూహ! ఇంతకును- పై రెండు గ్రంథములు- నిప్పటికి దొరకలేదు. వానిలోని కొన్ని పద్యములను మాత్రమే ప్రభాకర శాస్త్రి గారు దాహరించిరి. కనుక- నాగ్రంథములుదొరకువరకును-వానివిషయమై యాలోచించు నక్క-ఱగూడ మనకు దప్పినది.

రాయల యాస్థానములో నష్టదిగ్గజములుండిరనియు- వారిలో తెనాలిరామలింగఁడొక 'గున్నయేనుఁగ'నియు-జన శ్రుతియున్నది. కృష్ణరాయల యాస్థానములో నెనిమిదిమంది కవులుండుట-యేమియు విపరీతముగాదు. కవిజనకల్పవృక్షమైన యాతని యాశ్రయమున- నెనిమిది మందిగాదు – ఎనుబది మంది యైనను నుండవచ్చును. ఎనిమిది మంది యుండినదే నిజమైనచో-వారి'కష్ట దిగ్గజము'లని పేరుండుటయు సహజమే! కాని- యీయష్టదిగ్గజముల కథలో నేమైన సత్యమున్నదో- నాటి కావ్యములలో నొక దానిలోఁ గాకున్న మఱియొక దానిలోనైన నీవిషయమేల ప్రస్తావింపఁ బడియుండలేదనుట- పెద్దప్రశ్న. ''మనుచరిత్ర'' – ''పారిజాతాపహరణము'' – రాయలకే కృతి యివ్వఁబడిన గ్రంథములు. 'ఆముక్త మాల్యద'ను స్వయముగ నాతఁడే వ్రాసెను. ఈమూఁటి యందును రాయల పడకటింటి ముచ్చటలు మొదలుకొని-

ప్రథన పరాక్రమమువఱకు - అత్యుక్తులతో - అతిశయోక్తులతో - విపులముగ వర్ణింపఁబడినది. కాని వీనిలో నెక్కడ గూడ నీయష్టదిగ్గజముల యార్భాటముల యూసేలేదు. పారిజాతాపహరణమున రాయలను గుఱించిన యీపద్యమున్నది.

కం॥ ప్్రతివర్ష వసంతోత్సవ
కుతు కాగత సుకవి నికర గుంభిత కావ్య
స్మృతిరోమాంచ విశంకిత
చతు రాం తఃపురవధూ ప్రసాదవరసికా॥
(పారి. 1_139)

ప్రతివర్షమును -వసంతోత్సవములలో-కవితాగోష్ఠులు జరిగెడివట! ఆసందర్భమునవే కవులకు 'రత్నహారహయవేదండాగ్రహారాది' ప్రదానములు. కనకాభిషేకములు గలగలలాడెడివి. గండపెండేరములు ఘల్లుమనెడివి. అష్టదిగ్గజముల కథలో నేమాత్రము సత్యమున్నను - వారిలో పెద్దగజమైన పెద్దన్నమాత్రము - మనుచరిత్రలో నెక్కడనో యొకచోట- నాకథ నిరికించి యుండుననని నాయూహ! విజయనగర పతనానంతరము - ఈగజములకథ నెవ్వఁడో యొకబుద్ధిమంతుఁడు - సృష్టించియుండును. జను "లదిగో పులియన్న - నిదిగో తోఁక" యందురు. ఈసందర్భమున మరియొక విషయమును దడవుటగూడ న్యాయమను కొందును. రాయల నాటి కవులలో కందుకూరి రుద్రకవియొకఁడు. రాయల యాస్థానమున_నీశాన్యదిక్కున నీతనియాసన ముండెడిదట! ఈవిషయమును విదేశరాయబారులును వ్రాసిరి. ఒకవిశ యొకనికి నిర్దిష్టమైయున్నపుడు-తక్కిన దిక్కులందును-

పద్ధురుకవులుండుటలో నాశ్చర్యమేమున్నదని యెవరైన నడుగవచ్చును. కాని—యీవాదముగూడ నమ్మఁదగినదిగా నాకుఁ దోఁచుటలేదు. కందుకూరి రుద్రకవి-యీశాన్య దిగ ధీశుఁడే గావచ్చును. కాని-యతఁడు-కేవల కవిమాత్రుఁడే గాఁడు. పరమశివాచార సంపన్నుఁడు. తీవ్రస్వభావుఁడు. ఆయన నోటికి-తక్కిన కవులుజంకెడివారు. "శాపానుగ్రహ దక్షుఁడ"న్న ప్రథఁగూడ నాతఁడు సంపాదించి యుండెను. నామమాత్రముననేగాక-స్వభావముచేతను గూడ – నాతఁడు రుద్రుఁడే! అట్టివాఁడు-వీరశైవులకు సహజమైన-తీవ్ర మతా వేశముచే-తనశివభక్త్యతిశయనిరూపణకో-లేక తన యపర రుద్రావతార నిరూపణకో – యీశాన్యదిశలో సింహాసనము గావలెనని పట్టుబట్టి యుండవచ్చును. కవులయెడఁ గృష్ణరా యఁడు జూపిన రసికత—ప్రసిద్ధమేగదా! మతవిషయమునఁ గూడ- నాతనిహృదయ మెంతయో విశాలమైనది. కనుక రుద్రకవి జూపిన యీచాపల్యమును గృష్ణరాయఁడు- మనస్వియై మన్నించి యుండవచ్చును. అందుచే-రుద్రకవి సంపాదించికొన్న యీశాన్యసింహాసనము – కవిత్వమునకుఁ గాదని నాయూహ! అది-యాతని మతోద్రేకమునకు-చిహ్న మైయుండును.

ఈసందర్భమున మరియొక విషయమునుగూడ-ప్రసక్తా నుప్రసక్తముగఁజెప్పుట—తప్పుగాదనుకొందును. పూర్వము కేరళదేశములోని 'నాముతిరి' రాజులకడ—'పదునెట్టరకవి' యనుపేరుతో కొందఱు విద్వాంసులుండిరి, 'పదునెనిమిదిన్న

ఆ విద్వాంసు లన్నమాట! ఆపందొమ్మిదిమంది కవులలోను-పదునెనమండుగు రుభయభాషా ప్రవీణులు, అనఁగా సంస్కృతమునందును-మళయాళమునను సమానమైన యధికారమును గల్గి-కవిత్వమును జెప్పఁగలిగినవారు, 'పూనంనంబూతిరి' యొక్కఁడు మాత్రము-మళయాళమున మాత్రమే రచన యొనర్చువాఁడు. అందుకేయాతఁడు 'అఱకవి.''

తెనాలిరామలింగనిలో గొంత హాస్యముండుటకు-అతనికావ్యములే ప్రమాణములు. కాని యతని పేరిట నాంధ్రదేశమున- ప్రచారములోనున్న హాస్యకథలకంతు లేదు. వానినన్నిటిని నిజమని నమ్మినచో-మనము పిచ్చివారమై పోదుము. ఆకథలలో చాలమట్టుకు-మోటుగా-అరసికముగానుండునవే యెక్కువ. అంతేగాదు. అసహ్యముగ-అసభ్యముగ గూఁడ నుండును. ఈకథలలో తెనాలిరామయ్యకు ప్రధానమైన ప్రతి నాయకుఁడు-తిరుమల తాతాచార్యులు. ఆనాఁడు తిరుమల తాతాచార్యులకుగల యధికారము-గౌరవము-సామాన్యమైనదిగాదు. రాజ్యాంగమున తిమ్మరుసులకెంత పలుకుబడియో-మతధర్మముల విషయమున తిరుమల తాతయార్యులకంతటి గౌరవము. పోర్చుగీసు రాయబారులు-తిరుమలతాతయ్య పలుకుబడి నెంతయో గౌరవముతో-నాశ్చర్యకరముగ వర్ణించినారు. రాయలసింహాసనము కంటెను-తాతాచార్యుల ధర్మాసనము-సభలోనున్నతముగ నుండెడిది. రాయలకు కుడివైపునవారు గూర్చొనుచుండిరి. తమిళ దేశమునందలి వైష్ణవదివ్య క్షేత్రములపై నాతఁడు ధర్మాధికారి, ''పంచమత భంజను''

డనియు తాతయ్యకు పేరు. ఆతనిగౌరవమెంత పెద్దదో-పాండిత్య మంత పెద్దది. ఆనాఁడుతిరుమలతాతాచార్యులనుచులకనగఁజూచిన వానికి-శిరశ్ఛేదనమదప్ప-తక్క-వశిక్ష పడియుండదు. కావున తాతాచార్యులను పరిహసించుయోగ్యతగాని-సాహసముగాని తెనాలి రామలింగనికి నుండుననుట-కాళ్ళు లేనికథ. రామలింగఁడు-కొంత హాస్యప్రియుఁడనుట మనకందఱకు దెలిసినదే! ఈసత్యమునుబురస్కరించికొనిసమాజము 'పొలుపొందు' లేని కథలను సృష్టించి-వానినన్నిటి నాతని తలపై కెత్తినది. ఈకల్పనాచాతుర్యములోఁగూడ-చాల పెద్దభాగము- తెంగలి వైష్ణవుల దే యయియుండునని నానమ్మకము. భట్టరు చిక్కాచార్యలు- తెంగల సాంప్రదాయమునకుఁజెందినవారు. తిరుమల తాతయ్య-వడహాల వైష్ణవుఁడు. రామకృష్ణునినాటికి-ఆంధ్రదేశమున వైష్ణవము-బాగుగా వేరూనుటయేగాక-వానిలో నవాంతరశాఖలుగూడ బయలుదేరి - పరస్పరము వెక్కిరింతలును నారంభమైనవి. మతవిశ్వాసపుమాత్ర కొంచెమెక్కువైనపుడు-ఏదేశమందైనను -ఏకాలమందును-ఇటువంటి మర్కటచేష్టలకు కొదువయుండదు, మళయాళభాషలో నొకప్రసిద్ధుఁడైన హాస్యకవియున్నాఁడు. అతనిపేరు 'తోలన్'. అతనిపైఁగూడ 'తలతోఁకలేని యనేకగాథలు మొలచినవి. కానివారికి తిరుమల తాతయ్యవంటి యొక యాలంబనము దొరుకలేదు. అది వారి దురదృష్టము, 'తోలన్' చక్కనిహాస్యకవి. ఆతఁడు రచించిన చాటువులను నేటికిని-'చాక్కియారులు' తమ కాలక్షేపములలో వాడుకొను చుందురు. 'కథాకలి' కౌశలములందుగూడ-నీహాస్యకవి

చాటువులకు-చోటుగద్దు. 'తోలక' రచించిన చాటువులను-'ఫలితము' లందురు, ఇతఁడు రామకృష్ణునికంటె చాల పూర్వుఁడు. సాళ్వరాజుల కాలములో-ద్రావిడమున-'కాలమేఘుఁడ'ను నొకకవి యుండెను. ఇతనికి తెన్గుదేశముతోఁగూడ సంబంధముండెడిది; తెనుఁగుదేశమును గుఱించి-యితఁడల్లిన చాటువులు కొన్నియున్నవి; కాని-'కాలమేఘుని' హాస్యమున నాజూకుతనము తక్కువ. ఆతనిరచన-మన శ్రీనాథుని హాస్యమువలెనుండును. తెనాలిరామకృష్ణుడు-కాలమేఘునిగూర్చి-కొంతవినియుండు ననుటలో నాశ్చర్యములేదు.

ఇంతవఱకును-రామలింగనిగూర్చి-మనమాడుచువచ్చిన మాటలు-గాలిమాటలు. ఆతని కావ్యముల ప్రసక్తియే యెత్తక-కవినిగూర్చి చెప్పికొంటిమి. ఇఁకనాతని కావ్యములను పర్యాలోకింతము. రామకృష్ణుని రచనలలోనేఁడున్నవి మూఁడంటిమి. మొదటిది ఉద్భటారాధ్యచరిత్రము. ఇది శైవమత ప్రాశస్త్యమును వర్ణించు గ్రంథము. తక్కినవి రెండును వైష్ణవమతములోని గొప్పతనమును విప్పిచెప్పును. అనఁగా రామకృష్ణుని దృష్టిలో కవిత్వమునకు మతప్రచారముదప్ప-వేఱు ప్రయోజనములేదేమో! రాయల యాముక్తమాల్యదయు-వైష్ణవమతమును ప్రచారమొనర్చినగ్రంథమే! కాని-రాయలకు ప్రీతిపాత్రములైన గ్రంథములు "పారిజాతాపహరణము," "మనుచరిత్రము" రెండును మతగ్రంథములుగావు. ఈనాటికిని తరుగని కావ్యసౌరభముగల యాగ్రంథముల వెనువెంటనేవచ్చిన రామకృష్ణుని కృతులు కేవల మతప్రీతి

పాదకములుగ నుండుట—మన కావ్య చరిత్రలో గమనింపఁదగ్గ విశేషము. ఈగ్రంథములలోని కొన్ని విశ్వాసములు—సర్వసమ్మతములుగావు. వీనిలో వివరింపఁబడిన భక్తిగూడ హృదయముతో నెక్కువ సంవాదము గలదిగా లేదు. అగుటచే రక్తి తక్కువ. ఒకరీతిగ నది మొద్దుభక్తి. ఈజాతిగ్రంథముల స్వరూప నిర్ణయమునకుముందు—ఆంధ్ర కవిత్వ చరిత్రకు ను-ఆంధ్ర దేశమతచరిత్రకునుగల - బాంధవ్యమును కొంత వఱకు గమనించుట యావశ్యకము గాకపోదు.

బౌద్ధధర్మమును దిగంతవ్యాప్తముగఁ బ్రచార మొనర్చిన - మహాపురుషుఁడశోకుఁడనుట – అందరెఱిగినదే! కాని-యాయశోదీపము చాలకాలము వెలుగలేదు. అతఁడు కన్ను మూసినవెంటనే—మగధదేశమునందు మరల బ్రాహ్మణులు విజృంభించినారు. వెంటనే యుత్తర హిందూస్థానమునందు వైదికమతము—అనఁగా చాతుర్వర్ణముల తరతమ భేదముతోనే ధర్మము పరిరక్షితమగునని—బౌద్ధపూర్వమైన యార్యమతము—మరల విజృంభించినది. ఆపై బౌద్ధమును మూఁడుపూవులాఱు కాయలుగ వికసింపఁజేసిన కీర్తి దక్కిన దాంధ్రదేశమునకే! నాగార్జునునివంటి మహామేధావుల యండదండలతో-నాంధ్ర ప్రజలయాదరాభిమానములతో-నిక్ష్వాకుల వంటి రాజుల పోషణతో బౌద్ధము—అనేక శతాబ్దములు ఆంధ్రమున సుఖశాంతులను వెదఁజల్లినది. తెనుఁగుదేశమున నాఁడును కొందఱు వైదికమతానుయాయులు లేకపోలేదు. జైనముగూడ నుండెను. బౌద్ధజైనము లహింసాత్మకము

నైనవి. వైదికమతమునకు ప్రభుత్వముయొక్క సాయము గాని-సామాన్య ప్రజానీకముయొక్క యాదరణగాని లేక పోయినది. కనుక దేశములో మతకలహములు నామమాత్ర మైనవి ప్రపంచచరిత్రలో ఆంధ్రులకు - అజరామరమైన కీర్తిని సంపాదించి పెట్టినది-బౌద్ధశిల్పకళా ఖండములే! అనేక శతాబ్దములు గడచినను వాని సౌందర్యము చిన్నమంత దగ్గ లేదు. ఆయమృత కుంచికల చాతుర్యము నేటికి మనల విభ్రాంతుల నొనర్చును-పులకరింపఁజేయును. శిల్పకళారంగ మున నింతటి సౌందర్యమును భావించి-చిత్రించిన యాంధ్ర బౌద్ధులు-లేక బౌద్ధాంధ్రులు-కావ్యనాటక సంగీతాదులైన యితర కళాభాగములపై-చేయివేసి యుండరనుటకు వీలు లేదుగదా! శాస్త్రములను సాధింపఁ బ్రయత్నించి యుండరను టయు నన్యాయము. కాని వారి యపురూపమైన పరిశ్రమను కళా తపస్సును వ్యక్తమొనర్చు శతసహస్రాధిక గ్రంథము లను పదిపదుకొకండు శతాబ్దములలో-తక్కినవారు సర్వనా శనమొనర్చిరి. ఈ ఘనకార్యములలో వైదికులకు ముఖ్య మైన భాగముండి యుండునని నాయనుమానము. అటు తరువాత వీరిలో వీరశైవులును జేరిరి. ఈ దారుణ చర్యలను గమనించినప్పుడు-తరువాతవచ్చిన "మహమ్మదీయు" 'లిట్లు' జేసి"రట్టు" జేసిరనుటచాల యన్యాయమనిపించును. ఇఁక నాంగ్లేయులందుమా? ఈ విషయములలో వారెంతయో పూజ నీయులు! ఇట్టిఘోరమైన వైజ్ఞానిక నాశనమునకు బూనుకొన లేదు గనుక! ఈనాఁడు హిందువులమని సగర్వముగ జెప్పికొని మురిసిపోవు మనమందరమును-మనపూర్వులు సాహిత్యము

నకు-విజ్ఞానమునకు-ఒనర్చిన యపచారము దలఁచి కొన్నప్పుడు సిగ్గుతోఁ దలవంచికొనవలసి వచ్చును.

పదవశతాబ్దపు ప్రాంతములలో వేఁగిదేశమున తూర్పు చాళుక్యుల దొరతన మారంభమైనది. వారిలో వైదికమతము మరల జైత్రయాత్ర యారంభించెను. అంతకుఁ జాల ముందే-బౌద్ధములోనియంతశ్శక్తి-యస్తమించినది. అన్నిమత ములలోవలెనే దానిలోను-ఆచారముల పేరిటియాడంబరములు అనుకరింపపేరిట హృదయదౌర్బల్యములు-బాగుగా వ్యాపించి నవి. ఇదినిజమైనను-బుద్ధుఁడుబోధించిన కర్మసిద్ధాంతము-అనఁ గా-'మానవుల సుఖదుఃఖములు వారు పండించుకొన్న పంటలే! వారొనర్చు కార్యముల ఫలితములే' యనునిర్ణయము ప్రజలలో బాగుగఁబ్రాకి పోయినది. వైదికులీ విశ్వాసముపై దండెత్తిరి. వారి దృష్టిలో సుఖదుఃఖములు దైవాధీనములు. దైవము మంత్రాధీనము. మంత్రము బ్రాహ్మణాధీనము. ఈ వైదికమతమును బ్రచార మొనర్చుటకు-రాజదండ మొక్కటే జాలినదిగాదు. అదియొకవైపు బౌద్ధులను-చిత్రవధ జేయుచునే యుండెను. దానికనుబంధముగ మఱియొకవైపు బ్రాహ్మణులు వైదికసాహిత్యమును సృష్టింపఁబూనికొన్నారు. ఆప్రయత్న పుతొలిఫలమే-అవిరళ జపహోమతత్పరులైన నన్నయభట్టుల ఆంధ్రమహాభారతామ్నాయము. భారతరచనతో-ఈనాఁడు సర్వతోముఖమై విలసిల్లిన ఆంధ్రసాహిత్య సౌధమునకు శం కుస్థాపన జరిగినది. ఈవిధముగ మతప్రచార దృష్టితో భార తాంధ్రీకరణమునకు బూనికొన్నందుననే - నన్నయ భారత

భాగములో-అనుగడుగునను - అవనీసురుల దివ్యత్వము ప్రతి పాదింపఁ బడుచున్నది. నన్నయ రచనకు-తిక్కన భారత మునకు గల భేదమును-ఈవిషయమున మీరు గమనించియే యుందురు.

భారతమువంటి విపులమైన మహాకావ్యరచనకు దగి నంతగా-నాఁటి తెనుఁగుభాష వికసింపలేదు. అంతేగాక-నాటి వ్యావహారి కాంధ్రభాషతో-వైదికపండితులకు సమగ్రపరిచ యముగూడ లేదేమో! అన్నిటినిమించి వైదికమతముతోఁ బాటు-వైదికభాషయైన సంస్కృతముమీదవారికభిమానము. అందువలననే-నన్నయ భారతములోసంస్కృతభాగమెక్కువ. ఈమాటనేనన్నది-అతనిలోనున్నసంస్కృతపద బాహుళ్యము నుబట్టిగాదు. వాక్యనిర్మాణ పద్ధతులలో-విభక్తిప్రత్యయము లలో-క్రియాపదముల కర్మణిప్రయోగములలో తెలుఁగుభాష కసహజమైన సంస్కృతమర్యాదలు-భట్టారకులరచనలో విపు లముగగన్పించును. ఇంతకంటెను విపరీతమైన విషయమొ క్కటిగలదు. నన్నయ మనభాషకొక వ్యాకరణమును రచిం చెను. దాని పేరే 'యాంధ్రశబ్దచింతామణి'. దానితో నాతఁడుశబ్దశాసనుఁడైనాఁడు. ఇంతకు చెప్పవచ్చిన దేమనగా నన్నయభట్టు - తెనుఁగువ్యాకరణమును - సంస్కృతములో వ్రాసినాఁడు. మఱి యదియెవరికొఱకై వ్రాయబడినదో- వైదికభాషపై నాతనికిగల భక్తివిశ్వాసము లెంతటివో- మీయూహకే వదలిపెట్టెదను.

తెనుఁగున భారతరచన మారంభమగువాటికి- శంకరుని యద్వైతము- బాగుగ ప్రచారమునకు వచ్చినది.

ఇది వైదికమతము—అనగా వేదసూత్రములనుండి సిద్ధాంతీకరింపఁబడినది. మాయావాదము—అద్వైతము యొక్క ప్రధానసూత్రమైనను—ధర్మము—చాతుర్వర్ణ్యనిష్ఠము— అనెడు వైదిక ప్రథమ సూత్రమును గూడనది గౌరవించినది. ప్రజలలో వ్యాప్తి జెందిన—బుద్ధునికర్మ సిద్ధాంతము నది ప్రతిఘటింపలేదు. కాని—దానిని జన్మాంతరము వరకు సాగఁదీసినది. ఆసాగింపే మనము నేఁడునమ్మెడు కర్మసిద్ధాంతము. వైదికమతమునకును—బౌద్ధజైనములకును—ప్రధానమైన తాత్త్వికభేద మొకటి గద్దు. బౌద్ధజైనములు—పురుషకారమును గొంతయధికముగ గౌరవించును. అనఁగా—మానవునిజీవితమును—నిర్ణయించునవి—'అతనిజ్ఞానము, మనోవాక్కాయ కర్మలు.'' అనియువి విశ్వసించును. వైదికమతము దైవశక్తికి విశేషప్రాబల్యము నొసఁగినది. నీతి కొంత తెరవెనుకకు వెళ్ళినదనియే చెప్పవలెను. యజ్ఞ యాగ పూజాప్రార్థనములచే — సంతృప్తులైన దేవతలు—మానవులకు—సర్వసుఖములు గల్పింతురని— వైదిక మతము విశ్వసించును — పురుషకారమును — దైవశక్తిని—మాయావాదమేగాక — త్రిమతములుగూడ — తరతమభేదములతో నంగీకరించినవి. దీనితో నాతాత్త్వికసమస్యకుఁ జక్కని రాజీమార్గమేర్పడినది.

ఈ రాజీమార్గమును గుదుర్చుకొనుటతో — అటు వైదికమునగాని—యిటు బౌద్ధజైనములలోగాని — లేనిప్రచండమైన శక్తి యొకటి—మాయావాదమున తిష్ఠవేసికొన్నది. వైదిక బౌద్ధజైనములు ప్రపంచమున—నైహికజీవనము — అసత్య

మని-భ్రమయనిస్పష్టముగ ననలేదు. భౌతిక యాథార్థ్యముల నంగీకరించి — బాధావిముక్తికై — తమకుం దమకుందోచిన మార్గములను—వింగడించి చెప్పినవి. కాని - యద్వైతము- భౌతికయాథార్థ్యమును-త్రోసిపుచ్చెను. ప్రపంచము దాని దృష్టిలో మాయ! అనఁగా-మిథ్య! ఈ 'మిథ్య' కతీతమయిన పరమసత్యమును గుర్తించి యనుభవించుటయే మానవ కర్తవ్యమని దానియభిప్రాయము. అటుతరువాత వచ్చిన ద్వైత విశిష్టాద్వైతములు రెండును-బ్రపంచముమిథ్యయనిస్పష్టముగఁజెప్ప లేదుగాని-లౌకిక జీవితమనిత్యమనుటయే వాని యుద్దేశ్యముగూడ! "జీవితమనిత్యమగుటచే-నాదరణీయము గాదు. మానవునకుఁగోరఁదగినదేదియు నీప్రపంచమున లేదు. అతని సర్వకర్తవ్యములును - పరలోకము నుద్దేశించియే యుండవలెను." అనియే యవి లోకమునకొసంగిన యాదేశము. ఈవిధముగ మూఁడుమతములును మానవునకుఁ బ్రాపంచికధర్మములు - ఎక్కువగఁ బాటింపఁదగినవి గావనియే చెప్పెను. వానిదృష్టిలో మనుష్యునకు సాంఘిక బాధ్యతలులేవు. కడకు భార్యాసుతాదుల విషయమునను— వానికిఁగర్తవ్యము సున్న. "ఐహికబాధములనుండి విముక్తి నందుటయే మానవుని యేకైక లక్ష్యమని యామతముల యభిప్రాయము. ఇంతయున్నను వీనిలో 'వైదికమునఁదప్ప' "పరమతద్వేష" మనుభావములేదు. వైదికములోనైనను "ద్వేషము" ఆమతసూత్రములలోఁగన్పట్టదు. సంఘమున బ్రాహ్మణులు సర్వోత్తములు. వారియధికారమునకుం బ్రతిఘటన జరగినప్పుడే - వైదికమునందు పరమతద్వేషము

నాల్కలు జాచినది. వైదికముదప్ప దక్షిణ మతములన్నియు-వర్ణభేదము — కులభేదము-వీనినంతగ నాదరించినట్లు గనపడదు.

ఒకవైపు వైదికము - మరియొకవైపు శంకరుని మాయావాదము దేశమునఁ బెనగొన్నప్పుడు — అనఁగా నన్నయకాలమున-కర్ణాటకములో మరొక మతము విజృంభించినది. అదే వీరశైవము. పశ్చిమచాళుక్యరాజును బట్టి పాలార్చి బిజ్జలుఁడు—సింహాసనమెక్కినాఁడు. బసవేశ్వరుఁడాతని ప్రాపుసంపాదించెను. బిజ్జలుఁడు బసవేశ్వరునకు బావ! అనగానాతని చెల్లెలికి భర్త! ఈ చనవుతో బసవనాయకుఁడు ముఖ్యమంత్రియైనాఁడు! భండార మాతనిచేతఁబడెను. ధనమంతయు నాతఁడు వీరశైవమునకై వెచ్చింప మొదలు వెట్టినాఁడు. బిజ్జలుఁడు జైనుఁడు. ఆతఁడాక్షేపించెను. మతోద్రేకమునకు ముందు బాంధవ్యములు బసవేశ్వరునకు కొఱగాలేదు. అతఁడుబావనేచంపించెను, బసవేశ్వరునికాలమువఱకును శైవము — వేదమున కెదురు దిరుగలేదు. బసవేశ్వరుఁడు దానిఁ నవైదికముగ మార్చెను. బౌద్ధజైనద్వేషముతోఁబాటు బ్రాహ్మణద్వేషముగూడ నందులోఁజోటుజేసికొన్నది. తుదకు శైవము-వీరశైవమై - పరమతద్వేషమే దాని ప్రధాన ధర్మమైనది. పరసిద్ధాంత ఖండనముతోబాటు-పరశిరః ఖండనముగూడ మోక్షకారకమై కూర్చున్నది. ఇంతటి యావేశపూరితమైనమతము-'ఇస్లాము' దప్ప-ప్రపంచచరిత్రలో మరొక్కటి లేదేమో!

నన్నయనాటికే కన్నడభాషలో శైవమతగ్రంథములు వెలసినవి. నన్నయతరువాత - తెనుఁగుదేశములో శైవము క్రమక్రమముగ వ్యాపించెను. తెలుఁగుభాషలోని మొదటి శైవగ్రంథము - నన్నెచోడుని కుమారసంభవము. నన్నెచోడుని మతావేశము-మిన్నయేయైనను-అదియాతని కవితాహృదయమునుత్రోసి రాజనలేదు. కుమారసంభవమునప్రచారకమత లక్షణములకంటెను గావ్యలక్షణములెక్కువ. వైదికముపై వచ్చినతిరుగుబాటు లక్షణములు దానిలో నడుగడుగునను నగపడుచునేయున్నవి. శైవులు-కన్నడమునుండి-యునేక సంప్రదాయములను గ్రహించినమాటనిజమే. అవియన్నియుభట్టారకుఁడ్వేరచిన మార్గ సంప్రదాయములకు నేరుగ వ్యతిరేకములు. మతమునవచ్చిన తిరుగుబాటే-కవితయందును గానిపించినదనిమనము సులభముగ నూహింపవచ్చును. నన్నెచోడుఁడు — అచ్చికములనువాడును. దేశీయ ఛందస్సులను - నుడికారములను - గూడ గట్టికొనును. అంతమాత్రమేగాదు. అతఁడు దుష్టసంధులొనర్చెను. మిశ్రమసమాసములఁజేర్చినాఁడు. ద్రావిడభాషల యుచ్చారణకనువైన యతిప్రాస నియమముల నేర్పఱచికొన్నాఁడు. ఈవిధముగ నతఁడు సంస్కృతవ్యాకరణామును—మార్గకవితా నియమముల నతిక్రమించినాడు. ఈ సందర్భమున 'కుమారసంభవము' నందలి గణేశజన్మ వృత్తాంతమును గమనింపఁదగినది. సంస్కృతపురాణములలోని కథకును-నన్నెచోడుని కతకునుపోలికలేదు. ఆదిదంపతులు గజరూపధారులై క్రీడింపగా-సతీదేవి-పార్వతి

గాదు-కరిణీ రూపముననే గర్భమునుధరించి గజాననుని గని నట్లున్నది. ఇదేకథ తమిళమునందలి తేవారములలోను-మరి కొన్నిటిలోను గనిపించును.

రాజరాజనరేంద్రుని ప్రాపుతో నన్నయ యారంభించిన వైదికమత పునరుద్ధరణ-అంతటితోనే యాగిపోయినదని చెప్పవచ్చును. జైనబౌద్ధమతములు పుట్టిన వేయియేండ్లకు తరువాత-మఱల చాతుర్వర్ణ్య ధర్మములు - యజ్ఞయాగాదులు-వీనినిబునః ప్రతిష్ఠ చేయుటకై-చేసినయత్నము-చాలపరిహాసాస్పదము. మనుస్మృతినాటికే - వర్ణధర్మములకు నడుములు విఱిగినవి. ఏవో కృత్రిమములైన యాలంబనములు వానికి-కల్పింపఁబడెను. అనేకమైన యార్థిక రాజకీయ-సాంఘిక పరిణామములతోఁ బాటు-ప్రజలమత విశ్వాసములో-మనస్తత్వములో-నాధ్యాత్మిక దృక్పథములోఁగూడ-ప్రచండమైన మార్పులేర్పడినవి.

వర్ణధర్మములలో-యజ్ఞయాగాదులలోఁ గొంతమంది విప్రులకుమాత్రమే విశ్వాసముండెను. అశేష ప్రజానీకమునకు-వానిలో నమ్మకము లేదు. బౌద్ధజైనములు-క్షీణదశకు వచ్చినవి. అద్వైతము-విరాగులను-జిజ్ఞాసువులను-ఆకర్షించునదేగాని-రాగద్వేష పూరితులైన సామాన్యజనుల కందుబాటులోనున్నదిగాదు. దానిస్వరూపమేయట్టిది. ఇఁక-ద్వైత విశిష్టాద్వైతముల మధ్యనున్న భేదములు-తార్కికులకుఁదప్ప-సామాన్యుల కర్థమగునవిగావు. అవి రెండువైష్ణవముగనే-చలామణియైనవి. బౌద్ధజైనముల స్థానము నాక్రమించి కొనుటకు-తీవ్రముగ పోటీపడిన మతములు రెండే! వైష్ణవము. వీర

శైవము, ఇవి రెండును-త్వరలోనే తెనుఁగు దేశమునఁ బ్రాకినవి. అందుచేనప్పుడు వచ్చిన కావ్యములన్నియు-శైవగ్రంథములో-లేక వైష్ణవములోనైయె కూర్చున్నవి. పాలకుఱికి సోమనాథుని బసవపురాణము నాటిదే ! రంగనాథుని రామాయణముగూడ నప్పటిదే ! ఒకటి శివపారమ్య ప్రతిపాదన - రెండవది విష్ణువేసర్వోత్తముఁడనుట ! ఈ రెండు మతములుగూడ-ప్రజలయాదరాభిమానముల నందికొన్నవే! వారి మనస్తత్త్వములకు - విశ్వాసములకనుగుణమైనవే ! నన్నయ్య వైదికమువలె-బలవంతముగ ప్రజలనెత్తిన రుద్దఁబడినవిగావు. కనుకనే యీకావ్యములకును-నన్నయభారతరచనమునకును బోలికయేలేదు. నన్నెచోడుఁడు ప్రవేశపెట్టిన పద్ధతులను - శైవవైష్ణవ కవులిర్వురును బాగుగా వినియోగించుకొన్నారు. వారింకను-నొక్కయడుగు ముందునకుఁ బోయి - సంస్కృతచ్ఛందస్సులనే సంపూర్ణముగ బహిష్కరించి-దేశీయమైన ద్విపదలోనే దమకావ్యముల వ్రాసిరి. ఈయభిప్రాయమునే పాలకుఱికి సోమనాథుఁడిట్లు వెలువరించెను.

"ఆరూఢగద్య పద్యాదిప్రబంధ
పూరితసంస్కృత భూయిష్ఠరచన
మానుగాసర్వ సామాన్యంబుగాని
జాను తెనుఁగు విశేషము ప్రసన్నతకు

నట్టులుగాక కావ్యప్రౌఢిపేర్మి
నెట్టన రచియింప నేర్చినజాలు

నుపమింప గద్యపద్యోదాత్త కృతులు
ద్విపదయు సమమ భావింప నెట్లనిన..."

(పండితారాధ్య చరిత్రము. దీక్షాప్రకరణము)

వారు వ్రాసినభాషగూడ ప్రజాభాష. దానిని శైవులు 'జాను తెనుఁగని' పిలిచిరి. పునరుక్తిని దోషముగగాక-పామర మనస్సుల నాకర్షించికొనుటకొరకై యాయుధముగ-ఆదరించి నారు. వైష్ణవ శైవములు రెండును- భక్తిప్రధానమైన వేగముక- వారికృతులలో-పాత్రల ప్రవర్తనకంటెను - హృదయావేశము లకే ప్రాధాన్యతయెక్కువ. ఈకవులు పండితులు మెచ్చికొను శిల్పమును వదలిపెట్టి - సామాన్యప్రజ గౌరవించు రసమునే కావ్యాత్మగ స్వీకరించిరి.

ఈవిధముగ మన తెనుఁగు కవిత్వము-నన్నయ మొదలుకొని తరువాత రెండువందల సంవత్సరముల వఱకును- మతముతోఁబెనఁగొనియే నడచినది. ఆదిమమానవచరిత్రలో కవిత్వము-అన్నికళలునుగూడ - మతముతో ముడివడియుం డుట-యేభాషలోనైనను సహజమే! యూరపులోఁగూడ- గ్రీకుపురాణములు మొదలుకొని-మిల్టనువరకు - మతములేని కవిత్వమే లేదు. క్రొత్తక్రొత్త మతములు పుట్టినపుడు - వాని కనుబంధముగ-గొంత సాహిత్యముదయించును. నూత్నమత ముతోఁబాటు నవీన సాహిత్యలక్షణములును-గొన్ని ప్రచార ములోనికి వచ్చును. ఈవిషయమన్ని భాషలచరిత్రలలోను-- ఎన్నిసారులో జరిగినదే!

తరువాత కాకతీయులు రంగమునఁ బ్రవేశించిరి. అను మకొండ-ఓరుగల్లు-రాజధానిగ వీరు - దమ పరాక్రమమును విజృంభింపఁజేసిరి. ఈకాలమునఁ బ్రజల విశ్వాసముకొఱకై - పందెములువేసికొన్న మతములు రెండు. వీరశైవజైనములు. వీరశైవము రంగమునఁ బ్రవేశించినపుడు-కేవల వాక్కలహముతో నాటకమంతరించుట యరుదు. రక్తపాతము జరగి-యటోయిటో-దేలిపోవనిదివారు వదలరు. ముఖ్యముగఁ బ్రతాపరుద్రుని కాలమున-జైనులరక్తమెన్నో సారులేరులై పారినది. రాజులుగూడ - శైవమతపక్షపాతముతో - జైనముపై శీతకన్నువేసిరి. ఈ యుపేక్షాభావమే-వారిసామ్రాజ్య నాశనమునకు-దారితీసినది. కాకతీయ సామ్రాజ్యమున గాక-తెనుఁగు దేశములోని తక్కిన చిన్నచిన్న రాజ్యములలోఁ-గొంత మతాభినివేశనము దక్కువ. వారి పట్టుదలలు-పరస్పరాంతః కలహములలోనే చరితార్థములై పోవుచుండెను. కాకతీయులకుగూడ నాకాలమున పెద్దతీరికలేదు. వారును ముస్లిముల దాడులలో మునిఁగియుండిరి. కాని-యితరులంతగా మతమును పేక్షింపలేదు.

దేశములోని మేధావులు-విజ్ఞులు - మతవైషమ్యముల నసహ్యించుకొన్నారు. మతవిద్వేషములలోని యజ్ఞానమును వారుగుర్తించిరి. ఆవాతావరణములో-శైవవైష్ణవులకు-సమన్వయము కుదిరించుమతము-శివకేశవులు సమానులని-అభిన్నులని-ఆదరించిన హరిహరోపాసనపుట్టినది. ఇటు అద్వైతమునకు-భక్తిప్రధానమైన వైష్ణవ వీరశైవములకు రాజీకుదుర్చుటకై-భక్తిజ్ఞాన మార్గములు రెండును-సమానముగ మోక్ష

మానసిక సాధనములని—సమన్వయవాద మవతరించినది. ఈ పరిస్థితులలో—తిక్కన మహాభారత రచనకై పూనుకొనెను. నాటియాంధ్రుల యుత్తమ సంస్కారముల సమైక్య స్వరూపమే—తిక్కనామాత్యులు. ఆతఁడు యజ్ఞమొనర్చిన వైదికుఁడు. శివకేశవుల నిద్దరిని నేకమూర్తిగ నారాధించిన భక్తుఁడు. అతని హరిహరోపాసనలోని యనుభవము—ఎంత సుందరమో — సహేతుకమో—ఈక్రింది పద్యములలో చూడవచ్చును.

కం॥ జలనిధి హిమవద్భూధర
కలితజనన కేళి కౌతుకవ్యక్తావ్య
క్తలలిత సౌందర్యస్ఫుర
దలఘు తను శ్రీసనాథ హరిహరనాథా!

కం॥ శ్రీమద రేఖవిపాద వి
రామాహిత గాఢశమధురానిర్భరని
ష్కామర్ద్ధిత వివిధ వికా
రామలచేతోనివాస—హరిహరనాథా!

ఆతఁడద్వైతములోని — యమృతమునాస్వాదించిన యోగి. ధర్మమనఁగా – ఆచారానుష్ఠానములు మాత్రమే గావనియు—మానవుల పరస్పర సుహృద్భావమే ధర్మమనియు గుర్తించిన మానవోత్తముఁడు. అంతటి 'విమలోదాత్త మనీషి' గావుననే—నాటి యాంధ్రుల కళాతపస్సు—తిక్కనభారతమున బ్రతిఫలించినది. నాటిసిజ్ఞులమతవిశ్వాసములన్నియు నాతని భారతమునఁ బ్రతిఫలించినవి. ఆనాటి కవితాకళారహ

స్యములతనిలోఁ గూడుగట్టుకొన్నవి. మార్గదేశి కవితాపద్ధ తులకు-సమన్వయము గుదిర్చినమనీషి యాతఁడు. సుదీర్ఘ సంస్కృత సమాసముల గాంభీర్యమును-తేట తెనుఁగు పలుకుల పొందికను-తిక్కన వాడుకొన్నాడు. తెనుఁగు నుడికారమును గ్రంథస్థమొనర్చుటయేగాక-అవసరమైనపుడు-క్రొత్తనుడికారములను సోదర భాషలనుండి దెచ్చికొన్నాఁడు. చాలనప్పుడు సరిక్రొత్తవి సృష్టించినాఁడు. ఇన్నిరీతుల 'నుభయకవిమిత్రుడు' తెనుఁగు వాఙ్మయమును బరిపుష్టమొనర్చెను. కావ్యవస్తువునకు-శిల్పమునకు-సమానమైన ప్రాముఖ్య మొసఁగినాఁడు - వస్తుకవితకు -రసకవితకు సమన్వయము గుదిర్చినాఁడు. ఈవిధముగ మతరంగములోఁ బ్రవేశించినసమన్వయదృక్పథము-సహృదయత-తిక్కన్న భారతకవితా కళలోఁ గూడ-ప్రతిబింబించుచున్నది.

అన్నిమతము లొక్కటేననువాదము దేశమున ప్రబలినపుడు-సాహిత్యమునఁగూడ-నొకముఖ్యమైన మార్పువచ్చితీరును. ఏదేశమందైననింతే! అన్నిమతముల మీఁదను—సమానమైన యాదరణగాని - నిరాదరణగాని ప్రజలకుఁ గలిగినపుడే-సాహిత్యము-మతమునుండి వేఱుపడుట కవకాశము గలుగుట! తిక్కన్న భారతమున ననుసరించినది సమన్వయవాదము, మతమునాతఁడు నిరాదరింపలేదు. కాని భారతము తరువాతవచ్చిన కావ్యములు మాత్రము-కొంత యామదృష్టినలవరచుకొన్నవి. కేతన 'దశకుమార చరిత్రము' మంచన 'కేయూర బాహుచరిత్రము' - మతమునుండి

వేలువడిన కావ్యములు. కళాదృష్టితో నీ రెండును - నుత్తమోత్తమ కావ్యములుగాక పోవచ్చును గాని - వీనిచారిత్రక ప్రాధాన్యమును మాత్రము మనము విస్మరించుటకు-వీలు లేదు. పైగా-దశకుమార చరిత్ర-తిక్కనకే యంకితమివ్వబడుటయు మనము గమనింపఁదగిన మఱియొక్క విశేషము. కవితాకళ-మతమున కనుబంధముగ-పరిచారికగా గాక-స్వతంత్ర ప్రతిపత్తిగలదిగ- మతాతీతమైన మానవ వ్యాపారముగ - తిక్కనవంటివాని యామోదముద్ర పొందిన దనిదీనియర్థము.

తరువాత 1323 లో ఏకశిలానగరము - నేలమట్టమయ్యెను. ఆనాటి వీరశైవ, జైన సాహిత్యములు - ఎంత ధ్వంసమైనవో అంచనావేయుట-కష్టము. తరువాత కొన్ని దశాబ్దములవఱకు - ఆంధ్ర దేశ మనుభవించిన నరకయాతన మన యూహాకే యందదు. చిత్రహింసలు-మానభంగములు-దేవాలయధ్వంసములు-బలవన్మతాంతరీకరణ. దోపిడి, గృహ దహనములు - ఆనాటి ముస్లిముల క్రీడావిశేషములు. మాన ప్రాణరక్షణమే దుర్ఘటమైన కాలమందుత్తమ సాహిత్యమే గాదు - ఏసాహిత్యమును బుట్టుటకు వీలులేదుగదా! కనుక కాకతీయ సామ్రాజ్య నాశనానంతరము - సుమారొక శతాబ్దము వరకును - తెలుగులో చెప్పికొనఁదగిన సాహిత్యమేరా లేదు. కొన్ని శతకములు మాత్రమే వచ్చినవి. వానిలో నాటి ప్రజల కడగండ్లు కనులకుఁగట్టినట్లు వర్ణింపఁబడినవి. ఇంతలో కుంతలమున కర్ణాటక సామ్రాజ్య నిర్మాణభేరి మ్రోగినది.

రెడ్డిరాజుల స్థిరప్రభుత్వము నెలకొన్నది. మెల్లగా శ్రీనాథుఁడు తన కవితాదిగ్విజయముతోఁ బ్రవేశించినాఁడు.

ఓరుగంటి పతనముతో - తెనుఁగు దేశమున జైన మతము- అంతరించినట్లైనది. వీరశైవమునకును-దెనుఁగుల యాదరము లభింపలేదు. పరమతద్వేషములేని శైవము మాత్రమే యెదిగినది. ప్రజలు కొందఱు శైవులు. కొందఱు ద్వైతులు. కొందఱు వైష్ణవులు. వీరందరు - మత కలహములు లేక బ్రదుకుచున్నారు. అద్వైతము నుభయమతానుయాయులును-పీఠాధిపతులెంత గాదన్నను - గౌరవించుచునే యుండిరి. శైవవైష్ణవములు లోకధర్మములు గను- అద్వైతము మతాతీతమైన సత్యముగను - నుండినవని చెప్పవచ్చును. దీనినే కొంతమార్చి చెప్పినచో - శైవవైష్ణవములు నాటిసాంఘిక ధర్మములు. అద్వైతము - వైయక్తిక మోక్షమార్గము. నాటి విజయనగరరాజులు - శైవవైష్ణవముల సమానముగ నాదరించిరి. తక్కిన రాజులన్నిటిని సమానముగ నిరాదరించిరి. ప్రజలలో - మతకలహములు లేనందువలననే- ప్రభువుల కీసమదృష్టి యబ్బె. ప్రజలకు 'ఇస్లాం'మీఁద నేర్పడిన - శత్రుభావము - శైవవైష్ణవ సామరస్యమున కొక ముఖ్యకారణ మనవచ్చును. 'మునలిమానుల' మూలమున సంఘవ్యవస్థఛిన్నాభిన్నమైనది. బ్రదుకు బండలైనది. దీనితో - ప్రజల మనస్తత్త్వమున మార్పేర్పడినది. ముస్లిందాడుల కేమతమును నడ్డుపడలేక పోయినది- కనీసము సమాధానమైనను చెప్పలేకపోయెను. ఏ దేవుఁడును-

ప్రజలను రక్షింపలేక పోయినాఁడు. ఈబాధలైహికములు కాబట్టి క్షణికములెమ్మన్నారు భక్తులు. ఇవి లౌకికము గనుక మిథ్యలెమ్మన్నారు జ్ఞానులు. దీనితో నిత్యజీవితమున—మతనియమములకుఁగట్టుబడు చున్నను — ప్రజలకు మతముపై — వ్యక్తముగ కొంతయుపేక్షా భావమును అవ్యక్తముగఁగొంతయవిశ్వాసమును గలిగినవి. సుఖశాంతులు లేకపోవుట— బాధలు దుర్భరమగుట — వీనితో వారికి జీవితముపైనుత్సాహము — నశించినది. నిస్పృహ - నిరాశ — మొదల నాక్రమించినవి.

మతమునకు — ప్రజలకు నిట్టి సంబంధమున్న కాలములో — రాజులుగూడ—వైయక్తికముగ నేదో-యొక మతమునాదరించినను — రాజకీయముగా మతప్రసక్తి లేని రాజ్యమునే జేసిరి. అంతకుముందే కవిత్వము-మతాతీతమైన కళగా స్థిరపడినది. ఈకారణములతో — కవిత్వ చరిత్రలో రావలసిన పరిణామములు — శ్రీనాథుని రచనలో — రానేవచ్చినవి. అది స్వతంత్రకళ గనుక —వస్తువుకంటె శిల్పము ప్రధానమైనది. మతాతీతమైనది గనుక-ప్రజల నుత్తేజపరచి యుద్బోధపఱచు కర్తవ్యమును వదలి — ప్రభువుల వినోదమే పరమార్థముగ పెట్టుకొన్నది. ప్రజలకు దూరమగుటతోఁబాండిత్య ప్రకర్ష ప్రబల మైనది. రసనిష్పత్తి యముఖ్యమై—వక్రోక్తి— శబ్దాడంబరము—ముందుకు వచ్చినవి. కవిత్వము—అంతఃపురములోని కర్పూర చందన తాంబూలాదులవలె—నొకవిలాస వస్తువైనది. ఆస్థానమునందలి నట విట గాయకులవలె—కవి యొక పరిచారకుఁడో యలంకరణమో యైనాఁడు.

ఆనాడే పోతన్న భాగవతము- తెనుఁగున పొడసూ పినది. నాటియాంధ్రుల నిరాశ-నిస్పృహ-వీని ప్రతిబింబమే భాగవతమని చెప్పవచ్చును. వీరశైవుల భక్తి వలె-పోతన్న భక్తియు-నావేశ పూరితమే! కాని-వారి భక్తిలో నహంకారము ప్రధానము. పోతన్నకు-వైరాగ్యము జీవగఱ్ఱ. శైవుల భక్తి లౌకిక కర్తవ్య నిష్ఠమైనది. పోతన్నభక్తి లౌకికకర్తవ్య పరాఙ్ముఖము. శ్రీనాథునికి-పోతన్నకు కావ్యవస్తువులలోనున్న భేదమునుబట్టి-వారి కవిత్వముగూడ భిన్నమార్గములలో నడచినది. పోతన్న ప్రజలకేదో ధర్మమును బోధించు చుండుటచే-నాతని కవిత్వము రసాశ్రయ కవిత్వము. ప్రజలకొఱకు వ్రాయఁబూను కొన్నవాఁడు గనుక నాతని పదములన్నియు-తెనుగులైనను-సంస్కృతములైనను - ప్రసిద్ధములే! భాగవతము నాటిప్రజల మనస్తత్వమునకు-ప్రతిబింబమేగాదు. ఆనాటిసాంఘిక వ్యవస్థపై నొక-తిరుగుబాటనియుఁజెప్పవచ్చును. దేశములో రాజకీయమైన స్థిరతలేదు. సాంఘిక ధర్మములు సదమదములైనవి, ఆర్థికవ్యవస్థ-ఛిన్నాభిన్నమైపోయెను. బ్రదుకే బరువై -ప్రజలను నిరాశానిస్పృహ లావరించినవి. సంఘమిట్లున్నప్పుడు-నీతికి-ప్రవర్తనకు నిలువనీడ దొరకుటకష్టము. ప్రజాజీవితములో వంచన-మోసము-కాపట్యము-చిందులుద్రొక్కెను. విలాసప్రియులైన రాజులకు-ప్రజలను-పాలించుకర్తవ్యము పోయి వారిని వంచించుట - పీలులేకున్న హింసించుట-నిత్యకృత్యములగును. నాటి రెడ్డిరాజులు 'ప్రసూతిపన్నును' విధించినారట! నాటి రాజదండమెంత బీభత్సముగ నుండినదో_ యిదియొక యుదాహరణ! నాటి రెడ్లు శైవులు, వెలమ

వైష్ణవులు. విజయనగర రాజు లద్వైతులు. నాటి కావ్యము లను పరిశీలించినచో - నామత సంస్థలలో నెంతవంచన- ధూర్తత్వము తాండవించినదో - తెలియును. మాకాశిని చూచిననే మోక్షము వచ్చునని యొకమతమనును. మాకం చిని స్మరించినచాలు--ముక్తితప్పదని మఱియొకఁడు సవాలు చేయును. విభూతి పెట్టుకొన్నంతనే_కైవల్యము కరతలా మలకమని యొకఁడనఁగా—నామములు పెట్టుకొన్నను-పెట్టు కొన్నవాని ముఖమును జూచినను చాలు-జన్మరాహిత్యమని యింకొక మతము ముందుకువచ్చును. నైతిక జీవనమునకు ధార్మిక ప్రవర్తనమునకు-ఆమతములలో విలువయున్నట్లేతో పదు. హృదయమునకు-విశ్వాసమునకు నుండవలసిన స్థాన మును — బాహ్యాచారములు - లాంఛనము లాక్రమించినవి. ఈదురాచారములపై-చిత్తశుద్ధిగల సహృదయు లందరును— తిరుగుబాటుచేసి తీరుదురు. కాని-నాటి చారిత్రక శక్తులను బట్టి-విజ్ఞానపరిధులనుబట్టి అప్పటితిరుగుబాటుదారు లందరును- పోతన్నవంటిభక్తులు-వేమన్నవంటి జ్ఞానులునైనారు. సాంఘిక పరిస్థితులమీఁద తిరుగుబాటు-సంఘమునేతిరస్కరించుఉద్యమ మైనది. 'నీవేతప్ప నితఃపరంబెఱుఁగ'నని-పోతన్న పరాధీనచిత్తు డుగాగా-వేమన్న స్వాధీన చిత్తుఁడై రాళ్ళు దేవతలైన రాసులు ప్రమింగవా-యని సర్వమత లాంఛనములకును_పరిహాసముతో శస్త్రచికిత్స జేసినాఁడు. నాటివంచక మతవిశ్వాసములకు— శ్రీనాథుని కవిత్వము-తక్కిన శైవవైష్ణవ మతకావ్యముల కవిత్వము ప్రతిబింబమైనట్లు-భక్తుల విశ్వాసమునకు భాగవత కవిత్వమువలె-నాటి యోగులదృష్టికి-వేమన్న రచనలు ప్రతి

బింబములు. సర్వమత నియమములను – తృణీకరించినట్లే– వేమన్న కళానియమములను గూడఁదృణీకరించెను. రాగద్వే షములను– అహంకార మమకారములను – అధిగమించి నట్లే – రచనలో శబ్దచాపల్యము – ఛందస్సుల లౌల్యము– అలంకార చాపల్యము మొదలైనయన్నిటి నధిగమించినాఁడు. అతనిలో నొకరచనయనిలేదు. ఒకశిల్పమనిలేదు. వ్యంగ్యమని లేదు. కల్పనలేదు. వక్రోక్తిసున్న. శబ్దసౌందర్యము హుళక్కి. శిశువులకుగూడ నర్థమగు తేటమాటలతో–శైశవక్రీడవంటి నడకగల యాటవెలదులే యతనిరచనలు. ఉప్పుకప్పురము– కంచుకనకము – ఇట్టినిత్య జీవితమున గనపడువస్తువులే వేమన వాడిన యుపమానములు. ఏకవిత్వమునైనను–అనుభ వించి యానందించుటకు – కళాత్మకదృష్టి–హృదయ సౌకుమా ర్యము గావలెను. కాని–వేమన పలుకులు విని యానందించుట కివిమాత్రమేచాలవు. సంఘ జీవితముపై నాసక్తి–సర్వమా నవులపై కులమతాతీతమైన మమకారము–స్వార్థరహితమైన హృదయావేశము–కొంతకుకొంత లేనిది–వేమన్న కవిత్వము రుచింపదు. అనఁగా నేటియభ్యుదయకవిత్వము ననుభవించుట కవసరమైన సాంఘికచైతన్యము–వేమన కవిత్వమునకుఁగూడ గావలెను.

అటుపై మనకవిత్వ చరిత్రలోని – ముఖ్యఘట్టము– కృష్ణదేవరాయల యుగము. విజయనగర రాజులు మొదట నుండియు–నన్ని మతములచేతను నాదరింపఁబడిరి. వారన్నిటి నాదరించిరి. విజయనగరరాజ్య శంకుస్థాపన జరగిననాఁడే–

వేదాంత దేశికులు-విద్యారణ్యులు - అక్షోభ్యతీర్థులు-సాయణ మాధవమంత్రులు- కాశీవిలాస క్రియాశక్తి - వీరందరును- శైవవైష్ణవభేదములు- ద్వైతాద్వైత భేదములు మఱచి- రాజ్యక్షేమమునకు సాయమొనర్చిరి. ఆరాజ్యమును స్థాపించిన సంగమ వంశరాజులు - అద్వైత మతానుకూలముగ వేదభాష్యమును వ్రాయించినారు. సంగమవంశములోని కడపటిరాజు—మల్లికార్జునుఁడు వైష్ణవుఁడుగ మారినను-తరువాత వచ్చిన సాళువ రాజులందరును మరల శైవులే! కాని వీరు— మతము నణగఁద్రొక్కుటకును బ్రయత్నించిన వారుగారు. తరువాతి రాజులందఱు వైష్ణవులు. అప్పటినుండి—యనఁగా-పదునైదవ శతాబ్దమునందు-వైష్ణవము-ద్వైతము-విశేష ప్రచారమునకు వచ్చినవి. శ్రీపాదరాయలు—పురందరదాసు పోషించిన 'దాసర కూటములు' ప్రజలలోఁజొచ్చుకొన్నవి. రాయలకాలమునాటికి రాజకీయముగ దేశము—సుస్థిరమైనది. సుభిక్షత నెలకొన్నది. మతవైషమ్యములు—మందగించినవి. కళలు—కలకలలాడినవి. ప్రజలే మతమునభిమానించు వారైనను-అంతనూఱంత లభిమానము గళపై జూపినారు. పదుమూఁడవ శతాబ్దమందే—మతమునుండి వేఱువడిన కవితాకళ-శ్రీనాథుని శృంగార నైషధాంధ్రీకరణముతోఁదనస్వతంత్రప్రతిపత్తిని ఋజువుజేసికొన్న కవితాకళ — సర్వతోముఖవికాసమును బొందుటకు రాయల యుగము సువర్ణయుగము. అప్పుడు కవిత్వము ధరించిన నూతనరూపమే- ప్రబంధము. దానిముఖ్యలక్షణము కేవల కథాశ్రయముగాని కవిత్వము. కవిత్వమునందు మతముయొక్క పలుకుబడి తగ్గిన

నాఁడే-కథయొక్క ప్రాముఖ్యమును తగ్గినది. శృంగారనైషధమువంటి శుష్కవాక్చమత్కార పూరితములైన ప్రబంధములు- అనఁగా వసుచరిత్ర-తదనుకరణము లింకనురాలేదు. అనఁగా ప్రజలహృదయములు శ్రీనాథుని నాటివలె-శుష్కములుగావు. కనుకనే మనుచరిత్ర-పారిజాతాపహరణముల వంటి-మనోహరములైన రసవత్ప్రబంధములునాఁడు బయలు దేరినవి. రాయలు స్వయముగ నాముక్తమాల్యదవంటి మత కావ్యమే వ్రాసినను- ముక్కుతిమ్మనకు - పెద్దన్నకు నాయన యొసఁగిన యమూల్యమైన గౌరవము మనచరిత్రలో నేకవ్రులును దఱువాత పొంది యెఱుఁగరు. మతగ్రంథమనిపించు కొన్న యాముక్తమాల్యదలోఁగూడ మతము ముఖ్యభాగముగాదు. కవితారచనయే ముందుకువచ్చి నిలచినది. మతమువాంగమైనది. కథకంటె వర్ణనలే-పెత్తనము సాగించినవి. ఉపాంగమైన మతములోఁ గూడ శుష్కాచారములకు — బాహ్యలాంఛనములకు-రాయలు వెలగట్టలేదు. భక్తి-ధార్మిక జీవనము - నైతికవర్తనము - వీని నెక్కువ గమనించినాఁడు. ఈవిధముగ మనకవిత్వచరిత్రకు - మతచరిత్రకు నెడతెగని సంబంధము-కృష్ణరాయల యుగమువరకును గనిపించుచునే యున్నది. మొదట మతమునకుఁబరిచారికగనున్న కవిత్వము క్రమక్రమముగ మతబంధమునుండి విడివడి-'మను చరిత్ర'— 'పారిజాతాపహరణము' - వీనియవతరణముతో - మతాతీతమైన వ్యక్తిత్వము — స్వయంసంపూర్ణమైన యునికిని సంపాదించి కొన్నది. రాయల పిదపవచ్చిన రామకృష్ణుని కృతులలో—మతమునకు ప్రాముఖ్యమున్నను—స్వతంత్ర కావ్యలక్ష

ణము లనేకము లున్నవి. ఉన్నత వర్గములకుఁ జెందినవారిలో- మతాతీతమైన కళాభిరుచులున్నను-సామాన్య ప్రజలమీఁద- మతమున కింకను-విస్తృతాధికారములుండినవి. తాతాచా ర్యులకున్న పలుకుబడిని గుఱించి - యింతముందే దెల్పితిమి. రాయలపిదప వచ్చిన కవులు విశాలదృష్టిని వదలి - వైష్ణవ మతపక్షపాతులైనారు. దానిఫలితమే-రామకృష్ణుని వైష్ణవ గ్రంథములు.

ఈ చరిత్రలో రామలింగని స్థానమేమి? అతని కావ్య ముల విలువయెంత? వాని వెనుకనున్న యాతని వ్యక్తిత్వ మెట్టిది? మనోధర్మమేమాత్రము? ఈప్రశ్నలు ఎంతజటిలము లైనను-వీనికి సమాధానము చెప్పుట మనకర్తవ్యము. కనుక నాబుద్ధి కందినంత మటుకు-నాకుఁదోచినరీతి సమాధా నములొసఁగుదును.

రామలింగనివ్యక్తిత్వమును గమనించుటకు - రాయల యుగము నింకను-కొంతలోతుగ పరిశీలింప వలెను. మను చరిత్ర - పారిజాతాపహరణము - ఆముక్తమాల్యద, యివి యన్నియు-కృష్ణరాయని జీవితకాలమునందే వెలువడినవి. వాని వెనువెంటనే - పాండురంగ మాహాత్మ్యము-వసుచరిత్ర- కళాపూర్ణోదయము - బయలుదేరినవి. వీనిలో-ఒకదానితో మఱొకదానికిఁబోలిక లేదు. ప్రతిదానిలో నేదోయొక ప్రత్యే కత స్వయంసంపూర్ణముగ నున్నది. ఆకవులలోఁబ్రతి యొక్కఁడు-ఒక విశిష్టరంగములో మహావీరుఁడు, స్వతం త్రుఁడు, ప్రతిభావంతుఁడు. ఆకవులలోఁగాని - కావ్యము లలోఁగాని - తరతమభేదములు నిర్ణయించుట యసాధ్యమైన

పని ! ప్రతికవియు-తనరంగమున మహోన్నతుఁడుగనుక ! నన్నయ మొదలు రాయల వఱకు — నీ విపరీత పరిస్థితి-కవితారచనలో నెన్నడును రాలేదు. ఈ పరిస్థితికిఁ గారణ మేమి? ఆయుగ ధర్మమేమి? దానిచరిత్రలోని రహస్యమేమి?

ఏ సంఘ మందైనను-ప్రజలజీవిత విధాన మొక్కటిగనే యున్నపుడు - వ్యక్తుల సాంఘిక వాతావరణమున — యేకత్వమే భాసించును. ప్రజలందరును — వ్యవసాయమే వృత్తిగా జీవించుచున్నారనుకొందము. అపుడావ్యక్తులకు తటస్థించు పరిస్థితులు-పరిసరములు - ఒకరీతిగనే యుండును. అపుడు వ్యక్తులలో భిన్నాభిరుచులుండినను — అవివ్యక్తము గావు. భిన్నమనో ధర్మములుండినను - అవి వికసింపవు. సంఘమందలి వ్యక్తులకు — ఆర్థికపరిస్థితులలో - జీవనోపాధులలో - భిన్నతయున్నపుడే-వారి వ్యక్తిత్వములు వేరు వేరుగ వికసించుట కవకాశముండును. రాయలయుగమున గలిగిన బ్రహ్మాండమైన మార్పిదే ! ప్రజలకు రకరకములైన వృత్తులు-భిన్న భిన్నములైన యుద్యోగములు-వివిధములైన వ్యాపారములు. భారతదేశములోని యన్నిప్రాంతములతోను-వారి బేరసారములు సాగుచుండెను. అంతమాత్రమే గాదు. ఇటు బర్మా - మలయా — 'ఇండోనీషియా'ల నుండియు-అటు పర్షియా-అరేబియా-పోర్చుగల్, మొదలైన దేశములనుండియు-సరుకులు వచ్చుచుండెను-పోవుచుండెను. ఆర్థికసౌభాగ్యమేగాక — భిన్న భిన్నములైన — యార్థికజీవన విధానములు నాటి ప్రముఖ లక్షణము. సైన్యమందును —

పరిపాలనా యంత్రాంగమందును - లక్షలాదిప్రజల కుద్యోగములు గల్పింపఁబడినవి. సాంఘిక వాతావరణములో వ్యక్తుల వైయక్తిక మనోధర్మములకు వికాసము లభించినది. ప్రతివాఁడును-బ్రదుకు తెరువునకై యేదోయొక వృత్తిని స్వీకరింపవలసిన-దుర్గతి పట్టలేదు. వృత్తులనేకములుండెను గనుక-ప్రతియొకఁడును - దనయభిరుచికి-శక్తిసామర్థ్యములకు తగిన వృత్తినే యెన్నికొనవచ్చును. ఈ విధముగ ప్రతియొకనికి-తనసహజాభిరుచులను పెంచుకొనుటకు-వైయక్తిక భిన్నత్వమును-అదియెంతసూక్ష్మమైనను-వ్యక్తపరచి వికసింపఁ జేసికొనుటకు-అవకాశములు గలిగినవి. బ్రతుకు తెరువుకోసమై గాక-కళలలో నభిరుచులు గలవారుమాత్రమే వానినాశ్రయించినారు. అన్నికళలకును - ప్రజలలో నాదరమున్నది గనుక-కళాకారులు తమశక్తిసామర్థ్యములకుఁ దగినట్లే-కళలనెన్నికొన్నారు. ప్రతిదానియందు నుత్తమోత్తములు బయలు దేరినారు. ప్రజలయభిరుచులలో భిన్నతలు వృద్ధియగుకొలఁది-కళాకారులు-తమకు ప్రీతిపాత్రమైన ప్రత్యేక పరిమిత రంగములోనే-శక్తిసామర్థ్యములను కేంద్రీకరించి - వృద్ధిపొందు నవకాశములు గలిగినవి. రాయలయుగములోని-కళలయొక్క-బహుముఖవికాసమునకు - ముఖ్యకారణమిదియే! ఆ కావ్యములలోని-ప్రత్యేకతలకు- ప్రేరకమిదే !

నాటికవులు - కవితలోని యొక్కొక్క-యంగమును - ఒక్కొక్కఁడు ప్రత్యేకకృషి జేసిసాధించినాఁడు - మృదు మధుర సమాసకల్పనలో - పదముల నర్థవంతముగ - అనఁగా ధ్వనిపూరితముగ వాడుటలో - ముక్కుతిమ్మన్న సిద్ధుఁడు.

శ్లేషలో భట్టుమూర్తి దక్షుడు-కథాకథనకౌశలము - పాత్రో
చితమైన సంభాషణ-వీనిలో పింగళిసూరన-నాటినుండి నేటి
వరకు నద్వితీయుడు. ఎంతటిపెద్దభావములనైనను - అల్ప
పదములతో జెప్పగలనేర్పు - ప్రజల నిత్యజీవితములోని
యల్పాల్పవిషయములనుగూడ గమనించి-వానికి కావ్యగౌర
వమును గల్పించుట రాయలసొత్తు. చంద్రుని వర్ణించినను-
చక్రవాకిని వర్ణించినను-కడకు జరఠారుణాతపములను
జూపించినను-వాని బాహ్యస్వరూపము మనకన్నులకుగట్టు
టయేగాక-హృదయములను రససముద్రమునవోలలాడించగల
శక్తి-యొక్క పెద్దనకే దక్కినది. ఇంక మన తెనాలిరామలిం
గనిలో స్పష్టముగ గన్పడు ప్రత్యేకశక్తి హాస్యము. మఱి
యొకశక్తి గూడ నతనిలోనున్నది. రాయలు ప్రజాజీవిత
ములోని యల్పాల్ప వస్తువులను-ఆచారములను మాత్రమే
చూడగల్గినాడు. ఆయన పరిశీలనాత్మకదృష్టి-ప్రజల యా
హారవిహారములకే పరిమితమైనది. రామకృష్ణుడు - ప్రజల
మనస్సులలోని యల్పాల్ప భావములనుగూడ గమనింప
గలడు. వారిహృదయము లందలి సంకుచితత్వమును,
క్షుద్రత్వమును జూడగలడు. సదాచారవంతులైన నిగమశర్మ
తల్లిదండ్రులు-తమసర్వస్వమును గోల్పోయి-తమకొడుకే
తమకు శరణ్యమై దూరమైనపుడు-దుఃఖించుటకు ప్రబలమైన
కారణము లెన్నియోయుండగా - ముక్కెర పోయినదని
యొకరు-నక్షముద్రిక పోయినదని మఱి యొకరు నేడ్చుట—
రామకృష్ణుని తీవ్ర విమర్శనా దృష్టికి మాత్రమే యందు
విషయము.

రామలింగని యీహాస్యమందును — తీవ్ర విమర్శనా దృష్టియందును — నాటి ప్రజలలో వచ్చిన-లేక వచ్చుటకుఁ బ్రయత్నించుచుండిన — యొక ప్రచండపరిణామము రేఖామాత్రముగ గోచరించును. కృష్ణరాయలయుగములోవలె నే-యూరపులో 'రినైజాన్స' యుగమందు-కళలన్నియు సర్వతోముఖ వికాసమును బొందుట కారంభించినవి. వానితోఁ బాటు-తార్కిక తత్వరంగముల యందును గృషి యారంభమైనది. ముఖ్యముగఁ బ్రజలలో వైజ్ఞానిక దృష్టి బయలుదేరినది. బాహ్యప్రపంచమును గమనించుట-పరిశీలించుట మాత్రమేగాక - దీనితత్వ మేమి యను ప్రశ్నించు దృష్టి యున్నమాట ! చెట్టుమీఁద నుండి క్రిందఁబడు పండును జూచి 'న్యూటన్' వలె, "ఇది భూమిమీదికే యెందుకు వచ్చినది? ఆకాశములోని కెందుకు పోదు? దశదిశలుండగా — నెప్పుడొకే దిశలో ప్రయాణించునెందులకని ప్రశ్నించుట విజ్ఞానదృష్టియొక్క ముఖ్య లక్షణము. అందరు గమనించెడు సాధారణ ఘటనలలో-నసాధారణత్వమును భావించుట—తక్కిన వారికంటె విలక్షణముగఁ జూచుట-యీ విజ్ఞానదృష్టికిఁ బ్రథమసోపానము. విజయనగరసామ్రాజ్యము - మఱిరెండుశతాబ్దములు నిలువ గలిగి యుండినచో—మనకళ లెంతటి మహోన్నత శిఖరములందు కొనియుండెడివో-విజ్ఞానదృష్టి యేవిధముగ రూపుగట్టెడివో-యూహింపఁ బూనుకున్నచో మనస్సు పులకరించి-పరవశమగును. ఆ యూహ యప్రస్తుతము. ఇక్కడ నేను-మనవిచేయఁ దలఁచిన దేమనగా-అందరు చూచిన

ఘటననే-విలక్షణముగ చూచుట యనుధర్మము. తెనాలి కవిలో రేఖామాత్రముగ గన్పించుచున్నది. ఈనాటిభావ కవిత్వమున స్పష్టముగ రూపుగట్టిన సౌందర్య పిపాస - పెద్ద నలో బీజప్రాయముగా నే నైయెనను - స్పష్టముగ గనపడు చున్నట్లు- నేటినవలాసాహిత్య లక్షణములు - కథాసాహిత్య ప్రత్యేకత సూరన్నలో భాసించుచున్నట్లు-ఈనాటి శాస్త్ర విజ్ఞానమునకు మూలకారణమైన - "సాధారణ ఘటనలలో- అసాధారణతా రేఖను జూచుట" - మన తెనాలి రామలిం గనిలో - సూక్ష్మముగ గోచరించును. పెద్దన్న సూరన్నల విశిష్టధర్మములవలె స్పష్టముగ లేదుగాని - శుక్ల పాడ్యమినాటి చంద్రరేఖవలె నస్పష్టముగ-వెన్నెలరాత్రిలో నరుంధతీ నక్ష త్రమువలె మినుకు మినుకు మనుచు-రామలింగని యసాధా రణ దృక్పథము - పాండురంగ మాహాత్మ్యములో ప్రత్యక్ష మగును. సర్వనాశనమై-దర్భముద్రికకు - హరిసుదర్శనపు పేరునకు విలపించుచున్న వృద్ధభూసుర దంపతుల హృదయ పరితాప మందరికిని - గనపడువస్తువు. కాని రామలింగనికి మానవ హృదయములోని సంకుచితత్వము -- స్వార్థములోని క్షుద్రత్వము గనపడును. ఆపాత్రలపై - నెవరికేగాని-సాను భూతి గలుగుట సహజము. కాని రామలింగనికి వారిపై నీషణ్మాత్రముగ నేహ్యాభావమే గలుగుచున్నది. సతీ సుతులు - అగ్నిహోత్రున కాహుతియైనారు. నిగమ శర్మ 'గుంటెచెఱువై' యేడ్చుచున్నాఁడు. అప్పుడు "నీవల్లని రూపునిక్కమని నమ్మి" అనివానినోటనే పలికించి - వానినే యపహసించుట రామకృష్ణుని ప్రత్యేకత! అంతమాత్రమే

కాదు. నల్లనిరూపములనుగూడ మానవులెంతో గాఢముగ ప్రేమింపఁగలరను - సూక్ష్మమైన సత్యమును రామలింగఁడు జూచుచున్నాఁడు. ఆనల్లని ముఖమునే – 'చంద్రబింబమని'- వానితోనే పలికించుచున్నాఁడు. తానువ్రాయుచున్నది మతగ్రంథము. ఒకవైపు పాండురంగని స్తోత్రమునే చేయుచున్నాఁడు. మఱొకవైపు "ఎన్నివేలేండ్లు గడచిన యేన యేండ్ల, వెలయు ప్రాయంబు గలకొయ్య విట్ఠలయ్య." అని యెవరికిఁదోఁచని సత్యము రామలింగనికి స్ఫురించినది. ఈసందర్భమున నిది భక్తిరస పోషకము గాదు. మఱి యాతఁడెందుకు రసభంగము జేయుచున్నాఁడనఁగా-వానివ్యక్తిత్వమే యట్టిది గాబట్టి! అతనికి రసదృష్టి కంటెను-విజ్ఞానదృష్టి యెక్కువ. వాని ప్రత్యేక ధర్మము- పెద్దనాదులకున్నట్లు - కవులందఱకు న్యాయముగనుండవలసిన "Subjective outlook" గాదు. మఱి ' Objective outlook". అందుకే యాతఁడెందునను లీనముగాఁడు. మనలను గానివ్వఁడు. రామలింగనిలో హృదయమునకంటె మేధస్సు ప్రబలము. కానియది వసుచరిత్రలోవలె – రాఘవపాండవీయములోవలె- కేవలాశ్చర్య జనకముగాదు. అఘటనాఘటన కార్యమగ్నమునుగాదు. 'బెర్నార్డుషా' వలె- జిజ్ఞాసా పూరితము. సంఘములోని దౌర్బల్యముల - స్పష్టముగ నెత్తిచూపి-మానవులకు-బుద్ధిగఱపునది,

---

# రామకృష్ణుని కవిత

రామకృష్ణుఁడు వ్రాసిన వైదుకావ్యములంటిమి. వానిలో రెంటి యడ పొడ గానరాలేదు. ఉన్నమూఁటిలో-నుత్తమోత్తమము పాండురంగమాహాత్మ్యమే. అతఁడుకుమార భారతిని వ్రాసిన యుద్భటారాధ్య చరిత్ర - యీకర్త పాండురంగ మాహాత్మ్యమును వ్రాయ ననిపించు చున్నది. అంతకుమించి దానిలోఁ బ్రత్యేకగుణము గానరాదు. ఏలేశ్వర గురువర్యుల శిష్యరికమున నెడగిన యుద్భటారాధ్య చరిత్ర నాటికిఁ గవితాకళనుఁ గూర్చి తెనాలి రామలింగనికున్న యభిప్రాయ మీ క్రిందిది.

చం॥ విలసదయాతయామబహువేదవివేక పవిత్రభావసం
 కలితములైనవాక్యములఁ గావ్యము సెప్పగ నేర్తు వాది కా
 వ్యుల కవితానిగుంభన సమున్నతిఁ గాంచినవాఁడ వౌదుని
 వలఘువచో విలాసగుణాకర రామయలింగ సత్కవీ!

( ఉ. చ. 1–26 )

కృతికర్తయైన దేచమంత్రి దన్నుగూర్చి యిట్లు సంబోధించి నట్లు కవి వ్రాసికొన్నాఁడు. దీనిలో మనకుఁ గన్పడు విశేష ములేవి? పూర్వకవుల కవితానిగుంభనముల పరిమళములు కావ్యమున గుబులుకొని యుండవలెననుట యొకటి. ఇఁక

జక్కినది - యలఘువచో విలాసము. ఆవచోవిలాసము- పవిత్రభావ సంకలితములైన వాక్యములతోఁగూడి యుండవలెననుట ముచ్చటైన మూఁడవగుణము. కావ్యాన్వయమని ప్రత్యేకముగ నాతఁడూది చెప్పుటలోఁగొంత మీమాంసా శాస్త్రపు వాసనగలదేమో? పురాణ కావ్యముల త్రోవలు దనరచనలోఁ బ్రతిబింబింపఁ జేయవలెనను ఉబలాటము పైనున్నంత యాసక్తి ఆవయస్సున రచనలోఁ దనముద్ర వేయవలెనను ప్రయత్నముపై నున్నట్లు గానరాదు. ఉద్భటారాధ్య చరిత్రకును - పాండురంగ మాహాత్మ్య రచనకును నడుమ నెంతయో కాలముగడచియుండు ననుటయు నా రెండు గ్రంథములరీతిని బట్టియే తెలియుచున్నది. ఉద్భటారాధ్య చరిత్ర నాటికి వ్యుత్పత్తి భాగమును మాత్రమే కవి పూరించికొన్నాఁడు. జన్మసిద్ధమైన ప్రతిభయున్నను - దానికింకనుఁ బ్రౌఢిమ యెదిగిరాలేదు. ఆప్రౌఢిమను లోకమనుగ్రహించి నేర్పవలసియున్నది. వ్యుత్పత్తి యనుభవముతో సానలుదీఱవలసిన కొఱఁత-ఉద్భటారాధ్య రచనా కాలమునకు స్ఫురించుచునే యున్నది. దానిలో వ్యుత్పత్తి లేకపోదు. వజ్రములున్నవి. కాని - లాభమేమి? మేలివజ్రములు - కీడుమణులు అన్నిటిని గలిపి కుప్పవోసినాఁడు. పాండురంగమాహాత్మ్యమున నట్లుగాదు. దానిలో నున్నవన్నియు మేలివజ్రములు, సానల దీరిన జాతిరత్నములు, ఉద్భటారాధ్యచరిత్ర చాలలేవయస్సు నదని యెందుకంటె ననఁగా - బదములు-భావములు వీనిలోని కొఱఁత యెట్లున్నను-అతని ప్రధానధర్మమే-అందులో లోపించినది. పాండురంగమాహాత్మ్యమునందు-ఇంతవిస్తృతముగ -

ప్రౌఢముగ గనుపించు పరిహాసదృష్టి తొలికావ్యమున రేఖా మాత్రముగనైనను గన్పడకుండుట -, యాశ్చర్యములో నాశ్చర్యము. ఆరచననాటికి వానికాగుణమే-జన్మసిద్ధమైన దే- ఇంకను కావ్యములోని కెక్కుస్థితికి రాలేదన్నమాట. అసగా- జాల చిన్నతనమున బహుశః విద్యార్థిదశలో నీరచ నము సాగించియుండును. పాండురంగమాహాత్మ్యము-వ్రాయు నాటికిఁ గవిచాలఁ బ్రౌఢుఁడైనాఁడు. కవికి-అందులోనుఁ దనకుఁ గావలసిన యన్నిహంగులను సంపాదించికొన్నాఁడు. కుమారభారతిగ నున్న తెనాలిరామలింగడు - శారదనీరూప మని పలికించికొనుస్థితికి వచ్చుట ముఖ్యముగ గోష్ఠులు- చర్చలు - వీనిమూలముననే. ప్రతివర్షమునను- వసంతోత్సవ ములు-విజయనగరరాజు లొనర్చుచుండిరని ముందే విన్నవిం చితిని. ఆయుత్సవములలో - కళాకారులందరు - ముఖ్యముగఁ గవులు - చిన్న - పెద్దవారు పాల్గొనుచుండిరి. సామ్రాజ్యాధి పతులను జూచి సామంతులు గూడ దమతమ యోగ్యతలకుఁ దగినట్టి యుత్సవములొనర్చు కొనెడివారు. లబ్ధప్రతిష్ఠు లైన కళాకారులకు నలుగురొక్కచోటఁ జేరి విషయమును జర్చించికొనుటకు - వారి సన్మానములమాట యెట్లున్నను - ప్రసిద్ధులైన ప్రతియొక్కరి వెంటను - అప్రసిద్ధులైన కొంత శిష్యుల మూక యుండెడిది. ఆవర్ధమానులుగూడ గురువుల యాశ్రయముతో నాయుత్సవములోఁ బాల్గొనెడివారు. వారిలో - అనఁగా శిష్యులలోను - గురువులలోను గొన్ని యభినివేశము లుండుటయు నసహజముగాదు. కాని నామన వియేమనఁగా - నసలే లేకపోవుటకంటె నభినివేశములైన

మంచివే. విజయనగరరాజుల సామ్రాజ్య తత్త్వమేయట్టిది. ఎవనిలోనైన నేకొంత గుణముగుపించినను - దానిని చక్కగా బెంపొందించి సామ్రాజ్యక్షేమమునకు వాడుకొనవలె ననుట వారియాశ. ఈ విషయమును నిరూపించు ననేకములైన చిత్ర కథలు విజయనగర సామ్రాజ్యచరిత్రలో వచ్చును. కృష్ణరాయల కాలమున నొక దొంగయుండెను. వాఁడు - బలిసి బందికాఁడైనాఁడు. వానికిఁ గొంతి పరివారమేర్పడినది. వాఁడొక చిన్నకోట గట్టికొని - చెదరు చెదరుగా నధికారుల నెదిరింప బూనుకొనెను. ఈవార్త రాయలచెవికివచ్చినది. వాని దుర్మార్గముతోఁ దనమనస్సు కలఁగుటతోఁబాటు - ఆ గజదొంగ సామర్థ్యమునుగూడ కృష్ణరాయఁడు గమనింపక పోలేదు. వానిని సామోపాయమున లొంగదీసికొని యొక పాళెగానిగా నొనర్చును. ఆదొంగ కధికారమిచ్చుట మూతికిఁ గళ్లెము వేసినట్లైనది. ప్రజలసౌఖ్యమును గమనింపవలసిన బాధ్యత వానిదేయయ్యెను. దొంగతనములు-బందిపోటులు- మొదలగువాని నాపుట వానికర్తవ్యమైనది. ఆదొంగయొక మహానాయకుఁడై - తరువాత విజయనగరాభివృద్ధి కెంతయో దోడ్పడినాఁడు. ఇది నాటి రాజులదృష్టి, ప్రజలదృష్టిగూడ. వారు - వర్ధమానులైన కవులను - ఇతర కళాకారులను- "సిదేమిపొమ్మ"ని - యీసడించి యెఱుఁగరు, ఉదారముగ వారిశక్తిని గమనించుచుండిరి. రాజులలోనున్న ఈమహాగుణము - నాఁడన్ని రంగముల యందును - సమర్థులను దయారుసేసినది. నేఁడట్టి గోష్ఠులు లేవు. చర్చలు లేవు. అనఁగా— జీవితముతో - సామర్థ్యమునకుఁ ప్రత్యక్షమైన సంబంధము

లేదన్నమాట, దీనిఫలమేమైనది?. ప్రతికవియును - ప్రసిద్ధికి రావలెనన్నచో - గవిత్వముఁ వ్రాసి యచ్చొత్తించుట దప్ప - వేరుమార్గము లేదు. అప్పటికైనను జనులు - చదువుదురని నమ్మకమేమి?. ఆవిశ్వాసముగూడ వాని యుత్ప్రేక్షయే, ఆవెత్తితో వాఁడు ప్రతిపుస్తకము నచ్చొత్తించి యాయస్త్రము లను మనపైఁ బ్రయోగించును. అదియట్లుండె. ఇంతకును జెప్పవచ్చిన దేమనఁగా - రాయలనాటికి - చిన్నవయస్సులో నున్న పింగళి సూరన్న - భట్టుమూర్తి - తెనాలి రామలింగఁడు - మొదలైన పిల్ల కవులందరును - నిట్టిగోష్ఠులమూలమున నెక్కి-వచ్చినవారే. వారికిగూడ నప్పుడప్పుడు - లేత వెఱ్ఱి యాక్రమించి - యొకటో - యర్ధమో-కావ్యములు వ్రాసిరి. కాని - వానిని వ్రాసితిమని వారనుకొనలేదు. మన మును అనుకొనుటలేదు.

పాండురంగ మాహాత్మ్యము రచించునాటికిఁగవికెన్ని యనుభవములోఁ గడచినవి. ఈతఁడనేక కవులను - వెక్కి-రించెనను కథలున్నవిగదా! అపుడీతనిని గూడ గొందఱు వెక్కి-రించి యుందురు. అట్టి కథలును - నొకటో - రెండో లేకపోలేదు. ఈరాపిడులతోఁ గొంతగుణగ్రాహిత్వము-విశాలదృష్టి- రామకృష్ణున కవశ్యము-గలిగియుండును. పైఁగా వినయ విధేయతలు - ముఖ్యముగ వివేకమును - బోధించు పేదఱికము-యొక్క- వాసనయు - గొంతయాతఁడు-రుచి చూచినట్లే యున్నది. రామకృష్ణుఁడు జన్మతః శైవుఁడు. నడుమ నాతఁడు వైష్ణవమును స్వీకరించెను. ఇతని వలెనే-

పెద్దనాదులుగూడ గొందరాకాలమున వైష్ణవులైనారు. వీరు దీనికి వచ్చుటలోఁ గారణము గొంతదాని యందలి యభిమానమైనను-ముఖ్యముగ నది వారియవసరములనుబట్టి యొనర్చుకొన్నమార్పని నాయూహ. రాయలనాఁడు - అహోబిల మఠమునకుఁ బట్టిన యదృష్టము - సామాన్యముగాదు. రాయలే యహోబిల మఠమునకు శిష్యుఁడు. దానితోఁ బెద్దనామాత్యులుగూడ నాప్రవాహమున బడిరి. తెనాలిరామకృష్ణుని గురువు భట్టరుచిక్కాచార్యులంటిమి. వారాకాలమున రాజ్యతంత్రములోఁగొంత ప్రసిద్ధి గడించినట్లున్నది. అందుచే రామకృష్ణునకు - చిక్కాచార్యుల యనుగ్రహము సంపాదించినచోఁ దనజీవితము చక్కఁబడునను - నాస పొటమరించి యుండుటలో నాశ్చర్యములేదు. ఈభావమున కుపస్ఫోరకముగ నాకుఁగన్పించిన యాధారమిది. పింగళి సూరన్న యద్వైతి, రాఘవ పాండవీయము- ప్రభావతీ ప్రద్యుమ్నము లాతఁడు శివస్తుతితోనే ప్రారంభించెను. కాని-కళాపూర్ణోదయమున మాత్రము లక్ష్మీనారాయణుల కగ్రపూజ యొనర్పవలసిన యవసరమేర్పడినది. కారణమేమి? కృతిభర్తలైన నంద్యాల రాజులు వైష్ణవులుగనుక. పేదఱికము మానవునితోఁ జేయించు వెకలితనములకు మితియుండదు, రామకృష్ణుని వైష్ణవముగూడ నిట్టిదే యయియుండునని నాయనుమానము. తనకావ్యమున మాత్రమాతఁడు—వైష్ణవమును దడబడలుగా వర్ణించినాఁడు. ఇంతకును సత్యము దేవునకెఱుక.

పాండురంగ మాహాత్మ్య రచనా కాలమునాటికి—గవిత్వమును గుఱించి రామకృష్ణునకున్న యభిప్రాయము

లేవి?. అతడేమైనఁ జెప్పినాఁడేమో మాతము. కృతిభర్తయైన విహారి వేదాద్రిమంత్రి – తన్నుగూర్చి యిట్లు సంబోధించెనని రామకృష్ణుఁడు చెప్పికొన్నాఁడు.

మ॥ ఉదయంబస్తనగంబు సేతువు హిమవ్యూహంబు నుంజుట్టిరా
విదితంబైన మహన్మహాంధ్ర కవితావిద్యా బలప్రౌఢిని
కెదు రేరీ! సరసార్థబోధఘటనా హేలాపరిష్కార శా
రదనీరూపము రామకృష్ణ కవిచంద్రా! సాంద్రకీర్తీశ్వరా!

ఈపద్యములో మనకుఁ బనికి వచ్చున దొకముక్కయే. మిక్కినదంతయు – సాధారణముగ నందఱు జెప్పికొనుకొంత సత్యమైనను జంభపుమాట. ఇందులోఁగూడ మనకవి కొంచెము ముందునకేఁ బోయినాఁడు "త్వమేవాఽహం" అన్నతాతకుగూడ దగ్గులు నేర్పినట్లున్నది – "శారదనీరూప" మనుట. కాని–మరల నొంతపొరపడినాఁడు మహాంధ్రకవితా విద్యాబలప్రౌఢితో – హిమవ్యూహమునకు – సేతువునకు సంబంధమేమున్నది?. ఈవిషయము తెన్నాలివానికిఁ దోచ లేదు. అతనివలెనే –చాలామందికి దోచనిమాట వాస్తవము. కృష్ణరాజుల రాచరిక మొక దెన్నునాటనే – అందుగూడగొంత భాగముననే – చెల్లెననుట – అందరెఱిఁగినదే. కాని–శ్రీనాథుని మాత్రము – వారికీర్తిధ్వజమును – ప్రపంచమంతయు త్రిప్పెను. ఈవిషయమున – తెన్నాలికవినైనను – వ్రేలెత్తి చూపుటెందుకనంగా – సమకాలికులకుఁదోచని – సుగుణములెన్నియైనా యితనికిఁదోచినవి గనుక. సరసార్థబోధములో

నర్చు సన్నివేశములు గల్పించుట—శారదా విస్తారమునకు నొకముఖ్యలక్షణముగ కవి చెప్పికొన్నాఁడు. ఈదృష్టిలో నాతని—కావ్యమునుగొంత మనము పరిశీలింప వలసియున్నది ఇంతమాత్రమేగాదు. ఆతనికి రచననుగూర్చి – మఱికొన్ని భాగములుగూడ నున్నవి. సత్కవిత్వమనునది – ధ్వనిపరీతమై – సాధువర్ణ సంబాధ బంధురము (పాం. మా. 3_76) గావలెనని – రామకృష్ణుఁడొనర్చిన యొకవ్యాఖ్య. అతనిస్నిగ్ధవర్ణముగ్ధాకృతియై – చతుర పదవిన్యాస ధన్యాసికయై — కవి — కవిత యుండవలె ( పాం.మా. 5–192 ) ననుట—వేఱొకటీక. సుకవిబంధము – సకలప్రవృత్తము గావలె ( పాం.మా. 3–24 ) ననుట మఱియొకతీర్మానము. ఈ వ్రాతలన్నిటినిఁగలిపి – యొక పాకమునకుఁదెచ్చికొన్నచో – రచననుగుఱించి – యాతని యభిప్రాయముగా మనకుఁ దేలుపిండితార్థమిది. "రచన సకలప్రవృత్తము గావలెను. ధ్వనిపరీతమై-లలితవర్ణములతోఁగూడి యుండవలెను. చతురపదవిన్యాసములు గావలెను. ఈగుణములలో—చతురపద విన్యాసమున సాధువర్ణసంబాధము" నను రెండువిశేషణములు రచనకుఁ జెందినవి. ధ్వని-ప్రధానముగ భావములకుఁజెందినది. సరసార్థబోధఘటన కథానిర్మాణములో నుండవలసిన గుణము. వీనియన్నిటితోఁబాటు— మృదువిశదోక్తులను (పాం.మా. 1–25). మఱియొక యోగ్యత గూడ నాతఁడు తనకుఁదగిలించికొన్నాఁడు. ముఖ్యముగ నాతనిలో శూన్యమైన దీ గుణమే. ఇది యాతని యాశ. అనుభవముగాదు. తనకు లేనిగుణ మున్నదని చెప్పికొను

టలో - గావలెనని యాకాంక్షించుటలో - మనుష్యునకొక సంతోషమున్నది. ఈ విశేషముగూడ నాటకోచితముం జేరినదే.

ఆతఁడు జెప్పినట్లు నిజముగా రామకృష్ణుని కవిత సకల ప్రవృత్తము. ఈ గుణము రాయలలో - గొంత నిండుకొని యున్నది. దానినీతఁడక్కడ నుండియే యొంవు దెచ్చుకొనెనేమో!. రాయలకంటెను - రామకృష్ణుఁడింకను - బాగుగా దీనిని సాధించినాఁడు. ఒక సన్నివేశము మాత్రముదాహరింతును పువ్వుల కారుడివోయినది. "హాసవిపుల ఖరకర మైౖ" వేసవి వచ్చినది. దానిని వర్ణించుచు - రామకృష్ణకవి యిట్లన్నాఁడు.

"రక్కెస జవ్వనులు మవ్వంపు మచ్చికల నిచ్చలు గ్రీడింప నాస్త్రీకావతుల యతుల నాభీవివరంబుల నింకినవి యుం బోతెనముల యుదకంబులింకె, విచికిలమాలి కాలంకృత మాళిభాగులును - నారంజిత ధాతుపటల పరభాగులు ను నగుభోగుల భాగున గ్రుడ్డు మోచు నెఱ చీమలచాలు చెమ్మయిమ్ములం గ్రుమ్మరం దొడగె (పాం.మా. 4-16).

ఎండకాలములందు స్త్రీపురుషులు జలక్రీడ లాడుట ప్రసిద్ధమైన విషయమే. నీరింకుటయు ప్రసిద్ధమే. ఇది యేకవియైనను జెప్పఁగలఁడు. ఎండకాలమున నెఱ్ఱచీమలు గ్రుడ్డు మోచును. చెమ్మయిమ్ములఁ దిరుగును. ఆకాలమున మల్లెలు విరివిగ బూచును. ఈ చీమల విషయము వర్ణిం

చుటకుమాత్రము గొంతపరీక్షాదృష్టి గావలెను. ఈ శక్తియే రాయలలోగూడ గలదని నేనింతకుముందు మనవిచేసితిని— అంతకుమించిన — యొకమెఱుఁగిందులోనున్నది. భోగులు 'విచికిల మాలికాలంకృత వకాళిభాగులు' ఎఱ్ఱచీమలు గుఱ్ఱ్ఱమాయుచున్నవి. గుఱ్ఱ్ఱలు తెల్లగా నుండునుగదా! అందుచే నుపమాన మదికినది. చీమలశరీర మెఱ్ఱగానుండును. భోగులును నారంజిత ధాతుపటల పర భాగులు. ఈ పర భాగశబ్దమెందుకు వచ్చినది? ఎఱ్ఱచీమలకు నడుమున గొంత నలుపుండును. భోగులును - ఎదలు - బాహువులు వీనిపైననే చందనాదులను బూసికొందురు. తక్కినగాత్రము నకుఁబూఁతయుండదు. అప్పుడు ధాతులిప్తమైన శరీరము నకును—దక్కినదానికిని వర్ణభేదము స్పష్టముగ గోచరించు చుండునన్నమాట. చీమల యాకారమున—నలుపు-ఎఱుపు వ్యక్తముగాఁగన్పడుచున్నట్లు, దీనికే-పరభాగత—యనిపేరు. ఈ యుపమానమును బొందించుటలో—నాతని చాక్యమెంతేని గలదు. ఇది యొక్కగొప్పగుణమే. కాని - యింతటితో నతఁడాగ లేదు. మహాభోగులైన పురుషుల నెఱ్ఱ చీమలతోఁ బోల్చుటతోఁగూడ-గంభీరమైన హాస్య మెంతయోయున్నది. ఈపని రామకృష్ణుఁడొక్కఁడే చేయుఁగలఁడు. వ్రీడావతుల జలకేళులు సవరించుటల వెనువెంటనే—యెఱ్ఱచీమలనూహించుటయు రామకృష్ణునకే దెలిసిన విషయము. ఇట్టివర్ణనమే కృష్ణరాయఁడుగూడ గావించినాఁడు. ఆ వర్ణనమిది.

తోట బగలుండి మల్లెలు మఱిమి కావు
లమర మాపైన నిశియంత్రముల కొయ్య

జేరు పగ్రిజవాొల్చె భావివృష్టికిని గ్రుడ్డు
తో మధురిమేచ్చ డిగు నెట్టచీమలనగ
( ఆము. 2. 70 )

ఈ పద్యముననున్న యుపమానమే రామకృష్ణుఁడు వాడినది. కాని-యొక భేదమున్నది. ఇతని కాపులను – రామకృష్ణుఁడు ధాతుపటలముగ మార్చెను. దానితో పోలికయింకను స్పష్టమైనది. పరభాగశబ్దము గొప్ప శబ్దౌచిత్యము. సామాన్య ప్రజను కృష్ణరాయఁ డెట్ట చీమలతోఁ బోల్చెను. ఈ హృదయములలోని – యనుభవములలోని భేదమునెంతైన మనమూహించికొనవచ్చును, రాయలయందును నీయుపమానమున్నది. కాని–యది రామకృష్ణునిధ్వనివంటి సరసమైనదిగాదు. ఆధ్వని వెనుక నాతనిహృదయవేదన యెంత యున్నదో పాపము!.

రామకృష్ణుఁడు రాయల ననుకరించినట్లే కొన్ని యెడల పెద్దనామాత్యుల మనుచరిత్రలోని ఛాయలనుగూడనందికొనుటకై ప్రయత్నించినాఁడు. ఈ క్రిందిసన్నివేశ మొకయుదాహరణము. ఇందీవరాక్షుని రాక్షసత్వావేశించినది. ఆయావేశమును పెద్దన్నగారిట్లు వర్ణించినారు.

కం॥ సన్నఁపువలయేరునమయి
యన్నుకొనుచు నాముదిన్నయట్లై రాగా
ఖిన్నుఁడైనై పురికేఁగితిఁ
దిన్నదనంబుసీగి కొన్ని దివియలు వెలుఁగన॥

కం॥ అంపఁదగువారిఁ గసరుచు
నంపి నగరుసొచ్చి వెలఁదు లాఁతులిఁగా
నింపఱఁ గశాభిహతులన్
జంపించితి వారి నన్ని శామధ్యమునన్॥

సీ॥ అభ్రమండలిమోఁచు నందాక నూఱక
పెరిగినట్లే మేను నరవరేణ్య!
అవనిభూధరనాను వందాక నూఱక
పఱచినట్లే మేను పార్థివేంద్ర!
అబ్జభూ భువనంబునందాక యూఱక
యెగసినట్లే మేను జగదధీశ!
అహిలోకతలమంటు నందాక నూఱక!
పడినయట్లామేను ప్రభువతంస!
గీ॥ అఖిల జగములు ద్రిమ్మంగునం తా కలియును
నబ్ధులేకును జెడగ్రోలు నంతత్రపయు
అచల చాలన చణమైన యదటుగలిగె
నసుర భావంబు ననుఁ జెందునవసరమున
( మనుచ. 5. 24 ).

పెద్దన్నయొనర్చిన యీభావము గాళిదాసు నొఱవడిగఁ బెట్టి కొని యొనర్చినదే. అతఁడు శాకుంతలమున – విమానావరోహణమును గూర్చి–యత్యాశ్చర్యమైన కల్పన–లేక–యనుభవమునొకటి వెల్లడించెను. పెద్దన్న ఛాయనే పట్టుకొని– రామకృష్ణుఁడిట్టిదే యొకపద్యమును జెప్పినాఁడు. అయు

తునకు - వాధూలమహాముని - "నీవు కప్పవై పొమ్మని శాపమిచ్చినాఁడు. ఆభావ మయుతుని హృదయము నాక్రమించికొనుచున్నది. ఆసందర్భమున వ్రాసిన పద్యమిక్రిందిది-

శా॥ "సీరక్షప్రాంగణ కర్కటీ బిలమునన్ నిద్రింప మృత్యాన్న మయూ
హారంబుంగబళింపఁ బెల్లరవనిట్టట్టుం బ్లుతంబుల్ గొనన్
మారాయాస్యదహీంద్ర భీతిహతిగొందుల్ దూరగోర్వన్ మదిన్
నారాటేత మనోబలంబగు భవిష్యద్భేక ముత్సేకమై.

( పాం. మా. 5. 275 )

ఇందీవరాక్షుని విషయమున బెద్దనామాత్యు లొనర్చిన సృష్టిని రామకృష్ణుఁడు మండూక విషయమున వాడికొన్నాఁడు. ఇందులో నధునాతనులు 'Parody' అని వింగడించిన యొకప్రహాసప్రకారముగూడ నణగియుండునని నాయనుమానము. ఇట్లు మనుచరిత్రకారులను భావములలో ననుసరించిన ఘట్టములనేకములున్నవి. వర్ణనలయందును గొన్ని పెద్దన్నచ్ఛాయలుగన్పించును. మనుచరిత్రలోని మాయాగంధర్వుఁ డుద్యాన వనమున బూలనిట్లు చిదుముచున్నాఁడు.

సీ. పసిఁడితోరము తోడి బాహువల్లన నెత్తి
నారికేళ బాదలపైఁ జాచిచాచి
కుచబాధకంబు గంపింప నొయ్యన విపం
చీస్వనమున జటసెప్పి చెప్పి
నతిలమార్గాన్వేషి దీర్ఘలోచనదీప్తి

గణముచేఁదోరణ గట్టి కట్టి
కమనీయతను కాంతి కనకద్రవంబున
నారామురంగంబు నలికియలికి
గీ॥ యానితంబ విలంబి కాలాహికల్ప
ఘనకచగ్రంధి నచటిభృంగముల కసిత
దీధితులు పడ్డి కొసఁగుచు దేవపూజ
విరులు సిదిమెఁడు కపట భూసురునిగనియె॥
( మను. ౩. ౭౮ ).

రామకృష్ణుఁడిట్లే పుండరీకుని ధర్మనిష్ఠను వర్ణించినాఁడు. ఆపద్యమిది-

సీ॥ తనువుతోఁ జరియించు ధర్మదేవతవోలె
మెలఁపున వనవాటి గలయఁదిరిగి
గణనమీరిన శౌరి గుణములు హృదయ సం
పుటినించుక్రియ విరుల్ బుట్టఁబెట్టి
తనకుఁ బవిత్ర వర్ధనమె కృత్యంబను
కరణి నూతను గుశోత్కరముఁ గూర్చి
అపవర్గఫల సిద్ధి హాదన్నై నఁ జేపట్టు
కైవడి బహుఫలోత్కరములొడిచి
గీ॥ యోగయాగంబు సలుపుచో నూర్మిషట్వి
శసన మొనరించుటకు యూప సమితిదెచ్చు
భాతిసమిధలుగొని మహాప్రాజ్ఞుఁడతఁడు
వచ్చులే బగటికి నిజా వాసమునకు
( 2 - 17 ).

పెద్దన్నలది ప్రథమాశ్వాసమున 'వరుణాతరంగిణీ' యనునొక పద్యముగలదు. పుండరీక చరిత్రలోని యీ పద్యమును వ్రాయునప్పుడు రామకృష్ణుని యెదలోఁ బై రెండు రచనలును భాసించి యుండును. కాని-యీ సందర్భమున పెద్దన్నచే వర్ణింపఁబడినవాఁడు 'కపటభూసురుఁడు''. రామకృష్ణుని 'పుండరీకుఁడు' నిజమైన భక్తుఁడు. తెన్నాలికవి-యనుసరణము లిట్లేయుండును. కాని - రామకృష్ణుఁడు దనరచనలో సమకాలికుల భావములనుగూడ ననుసరించినాఁడనుట కిట్టివి సూచనలు, ఈగుణమాతని యుదారభావములను దెలుపుచున్నది. ఇతఁడొక్కఁడేగాదు. నాటి రచయితలందఱును జిజ్ఞాసతోనో - జిగీషతోనో - సమకాలిక గ్రంథములను బఠించెడివారు. నేటిరచయితలకుజిజ్ఞాసలుసున్న. నాలుగుపద్యములు వ్రాసినవాఁడంతయు నన్నయకు దరువాత దనకే యగ్రతాంబూలము రావలెనని కూర్చొనును. ఇఁక-జిగీషకుఁ గావలసిన చదువేదీ? . ఉన్నదంతయు నహంకారపు బలమేదప్ప పాండిత్యపు బలముకాదుగదా ! అది యట్లుండె.

ఒక్కొకయొక్క ముక్కతో బ్రహ్మాండమైన సన్నివేశమును సృష్టించుట-లేక సన్నివేశమునకంతయుఁ గాంతి నొసఁగుట మహాకవుల రచనలకున్న బ్రధానమైన లక్షణము. బ్రహ్మాండమైన సమాసములుగూర్చి-అల్పములగు సన్నివేశములను చెప్పుట-కొండనుద్రవ్వి యెలుకను బట్టుట వంటిది. సాధారణముగ శబ్దసిద్ధిలేనివారు-ఉన్నను-విపరీతమైన చాప

ల్యములు గలవారిట్టిపను లొనర్చుచుందురు. రామకృష్ణుడు గొన్ని యుపమానములతో నర్థభావగాంభీర్యములను సూచించినాడు. ఒకటి – రెండుదాహరణములు దమకుం జూపించి ముందునకుంబోదును.

సుశీలయను పతివ్రతకథ చతుర్థాశ్వాసమున వచ్చును. ఆమెభర్త కడులోభి. ఒకనాం డా యింటికిం గుహనావటుం డరు దెంచినాడు, అతం డామె నాశీర్వదించినాడు "బొట్టనకు మేదావిమేదు నలవాటునం గండిన యంగుళీద్వితయంబు దేటిగుట్టినల బృథగ్వర్ణమూర్తులగు సవర్తికలుగల జలరుహంబనం బ్రకస్తంబగు హస్తంబెత్తి "స్వస్త్యస్తుతే" యని యాశీర్వదించుటయు.

( పాం. మా. 4–152 )

పై యుపమానమున బ్రహ్మచారి కర్మనిష్ఠ సూచితము. తెచ్చిన జలరుహోపమానము ప్రాత దేయైనను–రామకృష్ణుడు దానికింకను మెఱుంగువెట్టెను. ఇట్టిదే, నిగమశర్మయక్క విషయమున వాడిన "పద్మకర్ణిక గొలువున్న పద్మవోలె" ననుమాటగూడ.

రామకృష్ణుడు గొప్పభావ స్వాతంత్ర్యముగలవాడు. ఒకవస్తువును – లేక – సన్నివేశమును నలుగురు చూచినట్లు చెప్పినట్లు చూచి చెప్పుట లాతనికలవాటు లేనివిషయము. ప్రతిభావమును–దాను ప్రత్యేకముగ జెప్పవలయునను ప్రత్యేక

దృష్టి-ప్రబంధ కవులకు సామాన్యమే ట్రైనను రామకృష్ణు నిలో—నున్నంత యితరులలోఁగానరాదు. మఱియెవ్వరుఁజూడని క్రొత్తవస్తువులే యాతఁడు జూచును. పాండురంగనిలో నాతఁడు భావించిన గ్రచ్చకాయలు-అడ్డతిత్తులు-తెగడతీగలు మొదలైన పదార్థము లిట్టివే. నలుగురు చూచువస్తువులలోఁ గూడ వానిచూపేయొక ప్రత్యేకమైనది. అనటిపండ్లను మాత్రమే యాతఁడు జూడఁడు. "చక్రోడదంష్ట్రలు చెఱకుసుగంధి" యనటిపండ్లను జూచును ప్రమథులను భావించి నపుడాతనికి

"కరటిదైతేయకుంభముక్తాలలాను
హారిభుజమధ్యముల" వారుగనే గనుపింతురు.

అతనియాశ్రమ బ్రహ్మచారులు - "చలకాకపక్షమస్తకులు" "నిజహోమ సారభేయీతర్ణకముల నీడలనిలచి కాచియున్న వారు." ఆతని యలంకార కల్పనయుఁ—బ్రత్యేకమైనది-విచిత్రమైనది. బ్రహ్మదేవుఁడు కాంతివేష పర్యాయదేవతమైన లక్ష్మీదేవి కొఱకు ఒంటికంబపు మేడను నిర్మింపఁదలఁచినాఁడట! పాండురంగని ముఖమే యామేడ. దానికిగట్టుటకు నిలిపిన శంఖశంకువు - విఠ్ఠలునికంబుకంఠము. ఇట్లేవేవో క్రొత్త పదార్థములను - గల్పనలను - మనయెదుట భాసింపఁజేయును. ఇవియన్నియు బ్రధానముగ రసమునేపోషించునని చెప్పుటకు వీలులేదు. ప్రబంధకవులకు - జమత్కారముపైఁ జూపున్నంత రసపోషణముపై లేదనుట యందరెఱిఁగిన విషయమే! ఆనందస్వరూపమైన యా రసానుభూతిని సాధించి—యనుభవించిన వాఁడొక పెద్దనామాత్యుఁడే.

కథానిర్మాణము కావ్యరచనలో నొక ముఖ్యమైన యంగము. ఈ నడుమవచ్చిన-నవీన కవిత్వములోఁ - గథ యుండదు. ఉన్నను-దానికొక స్వరూపముండదు. ఒక వస్తువును సన్నివేశమును — జూచినప్పుడు-భావించినప్పుడు-కవి తన యనుభవములను అభిరుచులను మాత్రమే పురస్కరించికొని-కొన్ని యభిప్రాయములు బ్రకటించుచు బోవును. ఈ కావ్యఖండికలలో-దాత్కాలిక భావావేశమే ప్రధానము. ఆయావేశముగూడ—వానికిఁదోచినదే. ఇతరులట్లే భావింపవలెననియు-భావించుటకు వీలున్నదనియు - నియమము లేదు. ఇతరులనఁగా-దనవంటి సహృదయులన్న మాట, "నీయనుభవములు మేము భావించుట లేదే, మాకనుభవములో లేవే" యని యెవరైన నడిగినప్పుడు - "నేనిట్లు భావించితి. "నని మాత్రమే యాకవి ముక్తసరిగ నిచ్చుసమాధానము. నీవట్లు దలఁపకున్నచో నా యాక్షేపణ లేద" నియు మఱియొక జవాబు, దీనిఫలమేమి? ఆ కవిత్వమందఱికొఱకునుగాక - తన కొఱకే నన్నమాట. ఇట్లుప్రతియొక్కఁడును దన దన కొఱకొక కవిత్వమును వ్రాసికొన్నచో - నికదిక్కేది? వ్రాసికొన్నను ఫరవాలేదు. దాని నందఱుజదివి-తలలూచవలెనన్నపుడే బాధ. ఇట్టి వెఱ్ఱివెఱ్ఱి-సిద్ధాంతముల ననుసరించియే-గతదశాబ్దములలో-"గళకళకొఱకే" నను భావము బ్రచారములోనికి వచ్చినది. ఈనాఁడు దానిదుమారము తగ్గుచున్నది. కావ్యము విశ్వశ్రేయమున కన్నమార్గమునకు—మరల నవకవులు వచ్చుచున్నారు. ఇదియొకమంచిసూచన.

కావ్యమునకు గథకావలెనన్నప్పుడు - దాని నిర్మాణ మెట్లుండవలెననుటయు గొంత విచారింపవలసినదే. కవిత్వ మెంతబాగున్నను – సన్నివేశనిర్మాణములందే చమత్కార మును జూపక ఊరక దస్తావేజులవలె వ్రాయుచుఁబోయినచో విసుగుకలుగును. ఇట్లువ్రాయువారుఁ గొందఱుకలరు. వారి విషయమై బాధపడ నవసరములేదు. కథారచనముగూడ నొక శిల్పమేనని యంగీకరించినచో – నదియెట్లుండవలెనన్న ప్రశ్న వెంటనే యున్నది. కథను నిర్మించుటలో నందరొప్పి కొన్నకొన్ని ధర్మములున్నవి. చెప్పవలసిన విషయము నంతయు-నొక్క-సారియే చెప్పక-పాఠకులను సంశయమందు ముంచుటయొకటి. దీనితో-ముందేమి జరుగునోయన్న యా కాంక్ష పాఠకుని యందడుగడుగునను – గలుగు చుండును. కావ్యముయొక్క- కడపట - నన్నివిషయముల నొకపాకము నకుఁ దీసికొని రావలెను. కావ్యమును కడవరకుఁ జదివించు టకిదియొక మార్గమన్నమాట. ఈదృష్టితో – గళాపూర్ణోద యములోని కథాకల్పనముగొప్పది. అనవసరములైన విష యములతో విసుగెత్తించక ముఖ్యమైనవానిని మాత్రమే పరి పుష్టములొనర్చికొనుచు – బోవునది మఱియొక విషయము. కొన్ని పాఠకుని యూహాకే వదలివేయవలెను. అముఖ్య విష యములనేగాక యత్యంతముఖ్యములైన వాటినిగూడ పాశ్చా త్యనవలాకారులు గొందరు-పాఠకులకే వదలిపెట్టిరి. అనఁగా- పఠితమనో భావములకుఁబెద్దతిండిపెట్టుటయన్నమాట. పాత్రల మనస్తత్త్వములు మొదలైనవానిని-రచయితయే వివరింపక- యితరులముఖమునుండి బలికించుట-ఇంకొకగుణము. ఈ

విధమైన సృష్టిలోఁ-గొన్ని కావ్యధర్మములుగూడ-సంక్రమిం
చును. కథాశరీర నిర్మాణమునందు మనకన్న పాశ్చాత్య
రచయిత లెంతయో ముందునకుఁబోయిరి. వారికథాకథ
నదక్షత యాశ్చర్యకరము. అపురూపము. తెనాలిరామ
కృష్ణున కీదృష్టిగొంతయున్నదనుట కీతఁడు వాడికొన్న "సర
సార్థబోధఘటనా హేలాపరిష్కార" యన్న విశేషణమే
సాక్షి. ఈ శిల్పమాతఁడెంతవరకు సాధించెనో చూతము.

పాండురంగమాహాత్మ్యము కొన్నికథల సంపుటి.
తక్కినదంతయు మాహాత్మ్యములచిట్టా! ఈతఁడు ఋతు
వర్ణనమొనర్చెను, రాధాదేవి శ్రీకృష్ణునిబొందుటకై —
తపమొనర్చు సందర్భమున నిందు కవకాశము దొరకినది
కవికి. అన్ని ప్రబంధములయందును — నష్టాదశవర్ణనము లం
తయోయింతయో చేర్పవలెనని లక్షణకారులన్నారు. ఆని
యమము ననుసరించి-యెవరో పెద్దనవంటివారుదప్ప ఋతు
వర్ణనము నందరొనర్చినవారే. పెద్దనామాత్యులు రెండు
మూఁడు ఋతువులనుమాత్రము దడవిరి. రెండు మూఁడు
పద్యములనుమాత్రమువ్రాసిరి. వానికిని-ప్రధానకథతో సం
బంధము నదికినారు. ఇదిచక్కని యౌచిత్యము. సాధార
ణముగ బ్రబంధ కవులలో-వర్ణనమునకు వర్ణనము - గథకు
కథ-యైయుండును. ఆముక్తమాల్యదలోని - ఋతువర్ణన
మిట్లేయున్నది. తెనాలిరామలింగఁడును — రాయలవలెనే
ఋతువులను గొంతయెక్కువగ వర్ణించెను. కాని-పెద్దన్న
గారి మెలఁపునుగూడ నీతఁడు గొంతసంపాదించికొన్నాఁడు.

ఆవర్ణనములకు రాధాదేవికథ కక్కడక్కడ ముడివెట్టుచు వచ్చెను. ఆతఁడనుసరించిన పద్ధతి యిది.

కం॥ పై నిగుడుమంచు తూవర
వానలచేఁ దడిసి కమలవనలక్ష్మి హరి
ధ్యాన నిమీలితలోచన
యానలరాధావధూటి కనుగలమయ్యెన్॥
( పాం మా 4-10 )

ఇట్లే-ప్రతిఋతువర్ణనమునకును-రాధాదేవి కథతో-సంబంధమునదికి-అది ప్రధానకథకు సంబంధించినది గాదన్న నింద నాతఁడు దప్పించికొనెను. మఱియొకచోటగూడ ఋతువర్ణనము వచ్చును. పాండురంగని పూజలతో నా ఋతువులకు సంబంధమును గూర్చినాఁడు, ఆఋతువులకిది-యన్నిటికన్నను గొప్పసార్థకత. ఈ కావ్యమునందు వస్త్వైక్యము లేదని-నాయకుఁడొకఁడుగాదని యాక్షేపణలు. ఇవి శుష్కలాక్షణికు లొనర్పుపని. రఘువంశముపై గూడ నిట్టియాక్షేపణ మొనర్పవచ్చును. పెద్దనామాత్యులపైఁగూడ నీయభాండ ముండనేయున్నది. లాక్షణికులుగోరినట్లెల్ల కవిత్వములు వ్రాయుచు బోయినచో-గడకు మిగులునవి లక్షణగ్రంథములు మాత్రమే. వారికొకదండమును సమర్పించి-యూరకుండుట మేలు.

కథ చెప్పుటయందు రామకృష్ణునిలో మరియొక మెలఁకువ యున్నది. అక్కడక్కడపాత్రలను దానే విమ

ర్శించుచు బోవుట. ఆ పోవుటలో నాతఁడొకసారి పాఠకులను మోసగించును. అట్టిపద్యములలో నిగమశర్మచరిత్రలోని యీరచనయొక్కటి. నిగమశర్మ చెడిచెటాకులై పోయెను. ఈ విషయము వానియక్కకు దెలిసినది. ఆమె మహాసమర్థురాలు. పుట్టినింటికివచ్చిచూచెను. తమ్ముఁడింటలేఁడు. ఎక్కడబోయెనో? యెన్నఁడు వచ్చునో-రానేరాఁడో చెప్పువారెవ్వరును లేరు. ఆయింటిలో సన్నాహమను జీవధర్మమే కఱవయ్యెను. ఆమెయు నేడ్చువారితో నేడ్చుచు గూర్చుండక-పంట-పైద విడద్రోవక-ప్రోచినది. ఇంటిలో మఱల జీవము నించినది. ఇంతలో నొక్కనాఁడు-తమ్ముఁడు చుక్కతెగిపడిన పడువుస-వచ్చినాఁడు. వాఁడు వచ్చినది మనస్సు మారిగాదు. అన్నపానములకు. అక్క వానికి-బుద్ధులుసెప్పినది. వాఁడుమారినట్లె నటించినాఁడు. ఆవులించిన ప్రేవులు లెక్కవెట్టు అక్కకుగూడ-వాని కాపట్యము కనుగొన సాధ్యముగాలేదు. ఆవిద్యలో వాఁడంతటి చతురుఁడు. అక్కను నమ్మించి - నిగమశర్మయింటిలోఁ దిరుగాడ నారంభించెను. వానిప్రవర్తనయిట్లున్నది.

"రాజాలయమునకు రాకపోకలుసేయు
మాసిన చదువులు మరల జదువు
నిన్నాళ్లనెచ్చెలు లెదురైన దలవంచు
కులవధూరత్నంబు గుస్తరించు
నాచార్యజనము బ్రత్యహము సంభావించు
నర్చావళికి నుపహారమిచ్చు

వర్షించుగుతపవేళాగతాతిథికోటి
పసినేడు దర్శించు పైరుపచ్చ

గీ। తండ్రి యుద్గమనీయంబు దానయుదుకు
నత్తికాభర్తతో నవ్వ నల్పసరణి
గ్రామకార్యంబుదీర్చ నంగడికి వచ్చి
తేసెబూసినకత్తి ధాత్రీసురుండు.

( పాం. మా. 3-46 )

ఈపద్యములోని కడపాదము జదువువరకును-వానిది కపట వర్తన మనుట మనస్ఫూర్తికేరాదు. "నిజముగ మారినా డాయేమి" యనిపించును. కడపటి చరణమున మనరామ కృష్ణుఁడు మనబుద్ధినిమోసగించినాఁడు. వాఁడమాయికుఁడైన మనలనుజూచి - నవ్వుచున్నట్లు నాకు భాసించును. ఇట్టి వెన్నియో వాఁడు సేయును. దొంగలచేతఁగొట్టఁబడిన నిగమ శర్మను కాపుఁవాఁడొక్కడింటికి గొనిపోయిరక్షించెను. వాని యింట పేఁడు మెలగుచున్నాఁడు. వారిరొద్దికయిది.

"తలలోపల నాలుక పూ
సలలో దారంబు పాలజల్లిన నీరుం
బలె వెలియెఱుఁగక మనసులు
గలిగి యభేదమున కాపుకడ నతడుండెన్

( పా. మా. 3. 59 )

ఇంతవర్ణించినను రామకృష్ణుఁడొకవైపు వానిని కపట పూరుషుఁడని ( 3–58 ) వానిరహస్యమును మనకు విప్పి చెప్పుచునే యున్నాఁడు. తనవర్ణనా కౌశలమునఁబడి మోసపోవలదని మనకు హెచ్చరిక యన్నమాట ! ఇట్లే యా కపట నటనానటు నొకచోట 'రామకృష్ణుఁడు' 'త్రాటికట్టు బోయ' యనెను. పైనవాఁడు నిజముగా బోయలలోఁగలిసి పోవును. ఈ విషయ మొకవిధముగా సూచ్యార్థసూచన వంటిది.

సుశీల కథలో నొక గొప్పసత్యమునాతఁడెఱింగించి నాఁడు. సుశీల పూర్వజన్మమున నొక మానిహోమ ధేనువు. ఆమె పాండురంగని మురళీనాదమునకుఁ గఱఁగి పాలుజల్లించి నది. ఆఫేనకణ మొకటివచ్చి మురళీధరుని మాళిసలంకరిం చెను. ఆపుణ్యముతో సుశీల భవాంతరమున నొకవైష్ణవు నకుఁ గూతురై పుట్టెను. పూర్వజన్మమునందలి సంస్కార బలముతో నామెకు సాత్త్విక ప్రవృత్తిగలుగుట సహజమే ! ఆమెభర్త పరమలోభి. వాఁడుదానినొక కళగా సాధించిన పుణ్యుఁడు. రాజులను వాఁడు–పదార్థములు–బియ్యము–పప్పు మొదలైనవి యాచించును. దానికొక సాకుగావలెనుగదా. ఇంటిలో–ప్రస్తుతమని చెప్పునట ! ఆగింజలుదెచ్చి కోమటిం డ్లలో నమ్మును. వాని రహస్యము గడ్డకు రాకుండుట కిదిమంచి యుపాయము. ఇంటిలో గాదెలనిండ–ధాన్యము న్నది. అఁకలికిఁ దట్టుకొని పస్తైన నుండునేగాని – ఆగాదె లపై మెత్తులూడ్వఁడు. తీరనిచుట్ట మెవ్వఁడైన–గ్రహచా

రము చాలక-యింటికివచ్చినచో - వెంటనే-రెండవ సూతక మ్మని పలుకును. సమయమునకు-సరిగా. వానికిఁదోఁచు సాకునకు - మనమాశ్చర్యము పడవలెను. ఇన్నిచాలక-పైగా వానికి వడ్డీవ్యాపార మొక్కటి. అప్పిచ్చిన వడ్డీ-అసలు-అరగాసుతోఁగూడ జమరావలసినదే! వచ్చుదనుక-అకృత సత్క్రియుఁడు - ముచ్చిచ్చునఁబడి వేగును. పరునిధనమెంతస్వల్పమైననసరే-తనయింటఁగలిసినచో-వానిసంతోషమునకు మేర లేదు. ఇతరుల యింటి-చిటికెడుదుమ్ముగాని-తనయింటఁజేరనీ నాఁడువానికి దుర్దినము. అంతటి చిత్రపురుషుఁడువాఁడు. సుశీలనెన్ని రీతులనో వాఁడు బాధించెను. కొట్టి-తిట్టి-రట్టుజేసినాఁడట! వీఁడింతకఠినుఁడగుటకు. కారణము-వీనిపూర్వ జన్మసంస్కారమే! పూర్వజన్మమున వానికి—అకృతసత్క్రియుఁడనిపేరు! 'వసుధాను' వనుపట్టణమున నుండెను. అప్పుడుగూడ వాఁడులోభియే! పూర్వజన్మమున వాని కల్యాణ గుణములిట్టివి.

సీ॥ ధనవంతుఁడయ్యు నుద్వాహంబుఁదొఱఁగి మా
తులునాకుఁబెఱవితంతువులఁదగిలి
కులవంతుఁడయ్యు పెద్దలబాసి విహరించుఁ
బాషణ్డషణ్డాను బంధియగుచు
మతి మంతుఁడయ్యునామ్నాయముల్ చెవిఁబెట్టఁ
డశ్లీల ఖేలనవ్యసన మొసఁగి
స్థితిమంతుఁడయ్యు లక్ష్మికిఁగాక త్రిమ్మరుఁ
బలుగూడు మఱిఁగి యోషిల్యల భజించి

తే॥ తలఁచు బ్రహ్మస్వ దేవస్వములకు నెగ్గు
కుప్పఁజిచ్చిడి పేలాలు కొఱుకఁదివురు
గ్రహణ కాలంబునందు మున్గఁడు జలముల
నెబ్రచెంచడ మాబ్రాహ్మణ బ్రువుండు!
( పాం. మ. చ. ఆ. 196 )

"అకృత సత్క్రియుఁడను పేరు వాఁడు గష్టపడి యార్జించి కొన్న బిరుదమే నేమో! వానికిఁ జిక్కక చిక్కక యొక వెలయాలు జిక్కినది. ఆబ్రాహ్మణుఁడు ఘోటకబ్రహ్మచారి. వాఁడా వారకాంతతోఁ గూడికొన్ని యేఁడులు పౌండరీక క్షేత్రమునందు వసించెను. వాఁడొకనాఁడ దాటుగ పాండురంగని నైవేద్య ప్రకల్పమును వీక్షించెనట! ఈ పుణ్యలేశముతో 'సకృత సత్క్రియుఁడు' మఱల బ్రాహ్మణుఁడై పుట్టి సుశీలకు మగఁడై నాఁడు. ఐనను వానికిఁ బూర్వజన్మమున సంపాదించికొన్న కొన్ని గుణములు - మాత్ర మీ పుట్టువునందును బోలేదు. ఇంతలో మఱియొక్క విశేషము జరగినది. ఒక కాకము-హంసము-చిలుక—పాము—తేనెటీఁగ— ఇవియును పాండురంగనికిఁ దమతమ నేర్చినట్లు సేవలొనర్చెను. ఈ సేవయప్రయత్నముగ జరిగినదే! కాని-దానిఫలమునకు వారు—సుశీలకే సుతులై జన్మించిరి! అపుడా సుతులిట్లుండి రట!

చ॥ ఒకడు నిరూఢ కృష్ణరుచియొక్కఁడు నిర్మలమానసప్రియుం
డొకఁడు ప్రయత్న యోగ్య ఫలుఁడొక్కఁడ నాదృతబంధకంచుకుం

పోకఁడు రసానుకూలమతి యుక్తుఁడునై విలసిల్లిరంత పు
త్రకులట నెట్టివారలకుఁదప్పునె తొల్లిటి జన్మవాసనల్ !
( పా. మా. చ, ఆ. 264 )

ఈజన్మమునందును వారికావాసనలంటివచ్చిననని-స్పష్టముగ-దెలుపుచున్నాఁడు కవి. చాలనందుకర్థాంతరన్యాసముతో నీకల్పనమునఁ దనయభిప్రాయ మిదేయని వివరించుచున్నాఁడు ఇట్టివెన్నియోవిషయము లాతని రచనా విధానమున నక్కడక్కడఁదగులుచుండును,

పాండురంగ మాహాత్మ్యమున ముఖ్యముగవచ్చునవి నాలుగు కథలు. మొదటిది పుండరీక చరిత్ర, రెండవది నిగమశర్మోపాఖ్యానము. మూఁడవది సుశీలకథ! కడపటిది-అయుతనియుతుల చారిత్రము. కథాకథన చాతుర్యమును బట్టిచూచినచో మొదటిరెండును నుత్తమకథలనియు తక్కినవి మధ్యమజాతికిఁ జెందిననవియు నా యభిప్రాయము. దీనికిఁగారణములు—తోఁచినన్ని మనవిసేయుదును. పుండరీకుని|— తొట్టతొలుత—కవి మనకిట్లు పరిచయమొనర్చును.

చ॥ అలికులవేణి విన్మురచితాఖిల పుణ్యుఁడశేషగణ్యుఁ డ
త్యలఘువివేకపాకఖనియార్య జనస్తవనీయచర్యుఁడు
జ్వలగుణరత్నరత్ననిధి సత్యదయార్జవ శాంతిదాంతి,మాం
సలగతి పుండరీకుఁడను సన్ముని పొల్చునొ కండు పెంపునన్.
( పాం. మా. ద్వి. ఆ. 5 )

మనకుఁగన్పడునప్పటికి పుండరీకుఁడు మంచియౌవన మునసున్నాఁడు. నాటికే యాతనికి వివేకమొక పాకమునకు వచ్చినది. దానికిఁగారణమైన సంస్కారము జన్మసిద్ధము. చదువుగూడ కావలసినంతయున్నది. పుండరీకుఁడేమి చదివినదియు - నెంతజదివినదియు - కవిమనకుఁ దెలుపలేదు. కాని-యక్కడక్కడ పోడిమాటలచే ధ్వనించుచుఁబోయెను. ఆతఁడు నిగమఘంటా పథైకధ్వనీనబుద్ధి. బ్రహ్మవిద్యలో ననవద్యుఁడు. మంత్రయోగ హఠయోగ రాజయోగముల మర్మమెఱిఁగి తదర్థ సిద్ధినిబడసినాఁడు. చదివిన యోగమునుభవమునకు దించి కొన్నవాఁడన్నమాట! ఇంతయేల? భాషా విభునిభుఁడు. మనమెఱుఁగునాటికే పుండరీకుఁడు రచితాఖిలపుణ్యుఁడు. ఈ విశేషణమాతని కౌమారమునకు - యౌవనములోఁ గొంతభాగమునకుఁ జెందినది. అప్పటికే యాతనికి చదువుతో - సత్ప్రవర్తనముతో - రావలసిన సామాన్య కీర్తిగాక-విశేషకీర్తియే యబ్బినది. అతనిచదువెంతటిదో-గొంతమనకు పుండరీకుఁడొనర్చిన దశావతార వర్ణనలోఁ గానవచ్చును. ఈ తఁడిట్లగుటకుఁదగిన బాల్యమునంతయు రామకృష్ణుఁడు మనయూహకే వదలిపెట్టినాఁడు. మఱియొక కవియైనచో దీనిని కృత్యాద్యవస్థనుండి మొదలుపెట్టియుండును. పుండరీకుని గుణవిశేషములన్నియు-రామకృష్ణుఁడు స్థూలముగ మనకంటి యెదుటనిలిపినాఁడు. ఈ పునాది మీఁదనేయిఁక - మేడకట్టబోవుదునని యితని భావము. ఈ

శిల్పము గొంత తిక్కనామాత్యులది. నిగమశర్మోపాఖ్యా
నమునందును — రామకృష్ణుఁడు-కథ-నిట్లే యారంభించెను.
నిగముఁడు మొట్టమొదట మనకన్నులయెదుట-

మ॥ వనితామానస సూనసాయకుఁడు జీవత్రాతపాదుండు భూ
జనసమ్మాన్య విశుద్ధవర్తనుఁ డుదంచత్త్యాగ శీలుండు చం
ద్రుని పెన్నిద్దిసమగ్ర కాంతిమహిమన్ నూనూగుమీసాల లే
గొన బుంబ్రాయపు తేజునూన యతఁడుత్కృష్టుండు వా
చాలతన్॥

( పా. మ. కృ. 6 )

అనుపద్యముతో రంగముపైఁ బ్రత్యక్షమగును. మనము
చూచునాటికే వానికి నూనూగు మీసాల ప్రాయము. బాల్య
మునఁగొంత చదువు-సంతజరగినది. కొంతయేమి? బాగుగనే!
నిగమశిఖారహస్యములన్నియు వాఁడు గన్నాఁడు. కనుట-
మాత్రమే! అనగా- వానివిద్యయనుభవమునకు రానిదన్న
మాట! దీనికిఁదోడు భూజనులందరు-వానిచుట్టును జేరి
వంశము-ధనము-చదువు-వీనినిబట్టి లేనిపోని పొగడ్తలతో
వానినిపై కెక్కఁబెట్టినారు. అనూచానమగు కుటుంబసాంప్ర
దాయము ననుసరించి-కొంత విశుద్ధవర్తనముగూడ బాల్య
మునయుండినది. ఆ యింత వర్తనమును సంప్రదాయముతో
వచ్చినదే! మనస్సుతో సంబంధము లేనిది. పుండరీకుని చరి
త్రలో 'నలఘు వివేకపాకఖని' యని యాతని వివేకమును
బ్రహ్మాండముగ వర్ణించిన రామకృష్ణుఁడు-నిగమశర్మవిషయ-

మున దానిని దడవనేలేదు. పై కథలోఁగూడ వానివివేకవిషయము రాదు. అక్కమాత్రము 'విషమికనైన నిట్టి యవివేకము మామకబుద్ధి పద్ధతి, న్నదువు' మని వానియవివేకమునకే 'సర్టిఫికెట్టు 'నిచ్చినది. అనఁగా వానికిఁ జిన్ననాట నుండి వివేకముతోడి సంబంధమే లేదన్నమాట! ఈ జనుల పొగడ్తలోఁ జిన్నప్పుడే నిగమశర్మకుఁ గొంత గూత్మాతిశయభావమే ర్పడినది. ఈ సూచన మన కాతని యక్కమాటలతోనే తెలియవచ్చును. ఆమెయిట్లన్నది.

''నాదుసహోదరుండు సుజనస్తవనీయనయప్రశస్త బ్రహ్మాదుల మెచ్చఁడు... (పా. మ. తృ. 39)

అనఁగా-జిన్ననాఁడే వీఁడు 'వాఁడెంత - వీఁడెంత' యనుటయు-గొంత యారంభించినాఁడు, ఇఁతలోసర్వాహంకారములకును-మూలకారణమైన పరువమావేశించినది, ''మీసాలు మొలచునపుడు - దేశాలుగనపడవని'' యొక సామెత! వానిస్థితిసరిగా నట్లైనది. వివేకహీనుఁడై-గర్వగ్రంథియైన వానిలీలలు - నానాముఖములగొనలుసాగ నారంభించెను. పైగా వాఁడు 'జీవత్తాతపాదుఁడ'గుటచే నింటివిషయములు విచారించికొనుబాధ్యతగూడ తక్కువైనది. జ్యేష్ఠపుత్రుఁడు. నింగివేల్పుల చేలకు - నేలవేల్పుల నింగికిఁ దెచ్చుచుఁగొలువగాఁ - దశ్(ర)పాభ్యుదయ మహిమతో జన్మించినవాఁడే నిగమశర్మ. అందుచేఁ దండ్రికి వీనిపై మమత యెక్కువ. ఏ బాధయునంట నీక పనులన్నియు దానే

దీర్చెడివాఁడు. దీనితో మనసు 'తార్తీయపురుషార్థమున' కుదార్చుట కింకను వీలైనది. ఈవిధముగ రామకృష్ణుఁడు వాడిన 'జీవత్తాతపాదుఁడు' అను విశేషణము సార్థకము. ఇఁకమిగిలినది – వాని'యుదంచత్త్యాగ శీలత్వము.' నిగమ శర్మలో నొక్కసుగుణమైన నున్నదన్నచో–నది యిదియే! వాఁడొకరీతిగ త్యాగి. అనాసక్తుఁడు. వానియింట బ్రహ్మాం డమైనయాస్తి. ఇదియంతయు నురగదష్టుని మేని–నెత్తురువలెఁ దక్కరాయత్తమై చెడిపోయినది. తనఖర్చు వెచ్చములకై నిగమశర్మపడినబాధ యింతింతగాదు. మేనగల సొమ్ములు గుదువబెట్టినాఁడు. తల్లిపైగల పసిడి గిలుబాడినాఁడు. ఇంటిలోనున్న పత్రములెత్తికొని పోయి మారుబేరముల కమ్మును. అడిగినవడ్డినిచ్చి యప్పులఁ దీసికొనును. గుడ్డవృ త్తులు–ధాన్యము–గుత్తచేలు సమస్తము నమ్మజూచును. వాఁడి చ్ఛావిహారవర్తి. వాని లీలలకు లెక్కలేదు. అప్పుల వార డిగినప్పుడూరుసారక–గూడునీళ్ళులేక – జెట్టుపుట్టలఁబట్టును. వలువలకు–గూటికి–నీచులవేడుటకు 'బోడచౌరవ' జొచ్చును. వీఁడెల్ల వానినిజూచి నవ్వినది. ఆస్తియంతయుబోయెనేయని వానికి దుఃఖములేదు. అష్టకష్టములు బడినప్పుడును–నిట్టూర్చి యెఱుఁగఁడు. ధనవిషయమున నెంతో – కష్టములవిషయ మున నెంతో వానిపాలికి–బరమపురుషార్థమైన గానుమునఁ గూడ వాఁడంతే! ధనమున్నంతవఱకు వాఁడవదినెలతో మెలఁగెను. ధనముతఱఁగినది. వెంటనే–వెలయాండ్రు–విటు లకందఱకుఁ జేయు మరియాదనే–వానికిని జేసిరి. ఇంటికివచ్చి యక్కను మోసగించి–కలిగినధనమంతయుఁగైకొని–పడుకకుఁ

జెప్పకపరువెత్తినాఁడు. త్రోవలోదొంగలు పట్టుకొని చావఁదన్నిరి. అప్పుడుగూడ వాఁడు-ధనమువోయెనని వగవలేదు. తగిలినచావుదెబ్బలకు పొగిలినదిలేదు. ఇంతలోనొక కాపువాఁడు వానిందెచ్చి యుపచరించెను. వానిపాలికి పీఁడొక పరమ్మాప్పుఁడు. దేశికోత్తముఁడు. ఆయింటనొక వికారపుఁగోడలున్నది. పీనికామెపైఁగన్ను. ఎంతఁజూచినను వానిది శారీరకమైన కామమే! ఒకనాఁడు దానిని లేవదీసికొనిపోయినాఁడు. వారు 'గహన ఘుంటాపథంబులు గడచిచనిరి. ఆమార్గములిట్లుండెనట-

సీ॥ కఠినకంఠీరవాకుంఠనఖక్షత జర
త్కరి శిరశ్శుక్తిశార్కరిల తలము
లాచాంత జంతుకంతాసృగుగ్రవ్యాఘ్ర
ముఖగుహాభాంకార ముఖరితంబు
లశ్వద్విష ద్విషాణాగ్రనిగ్రహ వహ
త్ప్రిస్తర ప్రసవ సౌరభమయంబు
లజ్ఞాతరవికర వ్యాపారభూరుహ
చ్ఛాయానపాయాతి శైత్యఖనులు

తే॥ గహన ఘుంట్టాపథంబులు గడచినడచి
యొక్కపక్కణ మీక్షించి యూరడిల్లి
యవర వర్ణస్నుషయు బ్రాహ్మణాధముండు
బోయకులమునఁగఁ సిరి పొలుపుదక్కి
( పాం. మా, తృ. ఆ. 83 )

అర్థము పొంతబోక ముందే—యీపద్యములోనినడక యే-యర ణ్యమార్గముల స్వభావమును సూచించుచున్నది. జరత్కు రుల శిరములను శుక్తికలతోఁబోల్చుటొక యపూర్వస్వా తంత్ర్యము. 'శార్కరిల' శబ్దము—పరిపుష్టమై-ధ్వనిపూర్ణమై యున్నది. 'ఝాంకార' పదము - బెబ్బులులయఱపువలెనే యున్నది ఇట్టిశాబ్దిక చమత్కారములెన్నియేని - తెన్నాలి కవిలోనున్నవి.

కాపుదాని నెగచికొని పోయిన నిగమశర్మ-దానితోఁ జేరి కల్లుపెల్లానెను. వేఁటాడమరఁగెను. వెదురుబియ్యమును దినెను. పలువన్నె వన్యామిషంబుల భుజించెను. కాచిన గురునెయ్యిఁద్రావెను. ఆకాపు దానితోఁగొంతసంతానము వానికిఁగలిగినది. ఇంతలోనదిచచ్చినది. వాఁడుబశ్చాత్తాప పడలేదు. ఒకమాల పడుచును జతగలుపుకొన్నాఁడు. ఆ ప్లవకన్యయందును సంతానముగలిగినది. ఇదివానినవరుస! గడచినదానికి వగవఁడు. రాఁబోవుదానికి జంకఁడు. అందిన కొమ్మఁబట్టుకొని పోవుచుండును. శారీరకబాధలు వానికి లెక్కయేలేదు. ఇదినిగమశర్మ సాధించినయోగము. దీనినే పాక్షికమైన త్యాగశీలతయని రామలింగఁడుద్దేశించెను. ఇది సమగ్రముగాదు. అనాసక్తిలోనియొక రేఖమాత్రమే యీ గుణము వానికి మనస్సులేకపోలేదు.

వాని కుటుంబమునకు దావాగ్ని యంటు కొన్నది. అపత్య – పశు – దార – ధనాదులతోనాయిల్లు

గుల్లయయ్యెను. అప్పుడు వానిమనస్సు గడ్డకువచ్చి నది. తన్ను లోక మెట్లుజూచినదో వాఁడెఱుఁగును. లలిత భావమునకు వానిహృదయమునఁజోటున్నది. కాని వాని గడచిన జీవితమంతయు సుడిగాలివంటిది. యౌవనమం-అం తకుమించిన యొక బలవత్తరమైన శక్తి - వాని నింతవఱకు, బట్టియాడించినది. ఈ విషయమును వాఁడెఱుఁగును. ఎఱిఁ గెననుటకు సూచనలున్నవి. కనుక రామకృష్ణుఁడు వాడిన యావిశేషణము సార్థకమే! పై రెండుకథలలో ననుసరించిన రచనావిధానమునే సుశీలకథలోఁగూడ కొంత యనుసరించి నాఁడు. ఆమెభర్తను గుఱించియు-రామకృష్ణుఁడిట్టిపద్యమునే చెప్పెను. అదియిది.

సీ॥ రూపహీనుఁడు మహాక్రోధనుఁడతిలోభి
　　బద్ధమత్సరుఁడన్యబుద్ధి మాయి
చంచల స్వాంతుండు సకల బంధువిరోధి
　　బహుళశపథోక్తి లంపటుఁడు శఠుఁడు
సంతతావిశ్వాస సస్యప్రరోహుండు
　　గర్వపర్వత మస్తక స్థితుండు
కలహాశనుండు తర్కక్రియాకుశలుండు
　　సంగ తోన్మాదోత్త మాంగకుండు
తే॥ నగున యేనియు నటువంటి మగనితోడఁ
　　గాపురము సేయుసతిదొడ్డగఱితయగుచుఁ
గసిడి కోఁతకునోర్చి లోవిసిగికొనక
　　ఘాతదూఱక తంద్రిస్రీతకు వగవక॥
　　( పాం. మా. చ. ఆ. 145 )

సాధారణముగఁ గష్టములలోనున్నవారు-దమవివేకము కథ యెట్లులున్నను-కనపడని బహ్మాను నాల్గుదిట్టుదురు. అంతతో వారితృప్తి దీరదు. కంటికిఁగనపడు వారిపైఁగూడ కొంత దుమ్మెత్తిపోసిననే – వారికిసమాధానము. ఈమనుష్యస్వభావమును-రామకృష్ణుఁడెంత యో బాగుగ-గమనించెను.

పుండరీకుఁడుగాని-నిగమశర్మగాని-యెక్కువగమాటలాడరు. ఆతఁడుసన్యాసి. వీడుదుర్మాని. ఇట్లువర్ణించుటలోనే-రామకృష్ణునకుఁ-బ్రీతియున్నట్లున్నది. నిగమశర్మ యవివేకములను-గొన్నింటిని వాని యక్క నోటితోఁబలికించెను. ఈ శిల్పముగూడ తిక్కనామాత్యులదే! ఆతండు సైరంధ్రియొక్క గంభీరత-వశిత్వము-మొదలైనకొన్ని గుణములను-కీచకునితోనే-బలికించినాఁడు. నిగమశర్మ-పుండరీకులవృత్తాంతములోని కొఱఁతనంతయు – రామకృష్ణుఁడు సుశీలవాచాలతతోఁబూరించికొనెను. ఆమెకొడుకులనందఱఁగూర్చుండ బెట్టికొని-యొక వేదాంతపు 'క్లాసు' 'కండక్టు' జేసినది.

కథకుగావలసిన విషయములన్నియు నొక్కచోటనే యాతఁడుచెప్పఁడు. లేకవరుసగనైనఁ జెప్పికొనుచురాఁడు. అక్కడక్కడ నవిసిపూలవలె విదిలించివేయును. వానినన్నిటి నొకవరుసకుఁదెచ్చుకొని-మాలికగాఁగ్రుచ్చుకొనవలసినజవాబుదారీ మనదే! పుండరీకుని కథలో–నిగమశర్మవృత్తాంతముతో రామకృష్ణుఁడీపద్ధతి నవలంబించెను. పుండరీకునకు తల్లిదండ్రులున్నారు. వారువయస్సు జెల్లినవారు.

తండ్రికిఁజూపును జాలదు. వారి సేవలోఁబుండరీకుఁడెక్కువ భాగము గడపెడువాఁడు. పుండరీకునకు భార్యగలదు. ఆమె 'యప్రతీపమతి' ఆతఁడు తల్లిదండ్రులకొనర్చు సేవలో నామెది గూడ నొక పెద్దభాగమే! తల్లిదండ్రులమరణము తరువాతనే పుండరీకునకు భార్యపై మనసు మరలినది. ఆమెవలన నతనికి 'ప్రబోధవిధేయమతులు' సుతులుగలిగిరి. ఆతఁడనుభవించిన యీ కామముగూడ సంతానమునుబడసి పితరులఋణముదీర్చుటకొఱకే! తల్లిదండ్రులు పరలోకమునకుఁ బోయిరి. ప్రాయము పడమటికి దిరిగినది. పితౄణము దీరినది. ఇఁక నాతనికి మిగిలినది 'శేషఫణిశయను' ని గను నాసయొక్కటే!

భగవంతుని దరిసించి-వరములు గోరవలెనను పేరాస-పుండరీకునకు లేదు. భగవద్దర్శనమే యాతనికి గానలసినది. భగవంతుఁడు ప్రత్యక్షమైన తరువాతగూడ - పుండరీకుఁడడిగిన వరమేమియు లేదు. ఈ విషయములన్నియు - రామకృష్ణుఁడు - విశకలితముగ నక్కడక్కడ విసరివేయుచుఁబోయెను. పుండరీకుఁడు తపస్సునకారంభించెను. ఎక్కడికి వెళ్ళెనో? — అది కవి చెప్పలేదు. ఇంటనుండియే తపస్సొనరించెనా? దానినిగూడఁ బ్రత్యక్షముగఁ దేల్చి చెప్పలేదు. శ్రీకృష్ణుఁడు వచ్చినప్పుడు మాత్రము - "తపసి పర్ణశాలకు దేవకీతర్ణకంబు" అని వర్ణించినాఁడు. దీనినిబట్టి - పుండరీకుఁడిల్లును విడచి - యా యూరనే యొక యోగ్యమగు స్థలమునఁ బర్ణశాలను గట్టికొని - తపమొనరించుకొనుచుండెనని మనమూహించికొనవలెను. నిగమశర్మ కథలోఁగూడ నింతే!

వారియాస్త్రి పాస్తులేమో మనకు మొదటఁ దెలుపఁడు. నిగమశర్మ యక్క వచ్చినప్పుడు మాత్రము - కొంత మనకా వాసన దెలియును. నిగమశర్మ భార్య పసిమి పసిడి పీవనతో వదినెగారికి పీఁచినదట! ఉండి యుండి - వాఁడొకనాఁడు - సొమ్ములనెత్తికొని యుడాయించినాఁడు. నిగమశర్మ యెత్తికొనిపోయిన భూషణముల జాబితా యీ క్రిందిది -

సీ॥ గోమేధి కోపలాంకుర మానితంబులు
పుష్యరాగచ్ఛటా పుంఖితములు
వైడూర్య సంధాన వర్ణనీయంబులు
హరినీలకీల నాభ్యంచితములు
కురువింద సందర్భ గురుతరంబులు, చతు
ర్విధ వజ్రదళ సమావేల్లితములు
మహనీయతర హరిన్మణి పరీతంబులు
సకలుషస్థూల మౌక్తికయుతములు
తే॥ పద్మరాగ పరీరంభ భాస్వరములు
దన్తవిద్రుమకృత సముద్గక భృతములు
మాతృభూషలు నత్తికామండనములు
విజయువతిదాల్చు సొమ్ములన్నియు హరించి
(పాం. మా. తృ. ఆ. 48)

పై పద్యమును జూచినపుడు - హారియాస్త్రి - నాటి యూర వీటి రాజులయాస్త్రిలో వర్తమైన నుండుననిపించును. ఇట్టిదే తెన్నాలి కవిరచన. కొన్నివిషయముల నాతఁడు మన యూ

హాకే వదలిపెట్టుటయు గలదు. పుండరీకుఁడాశ్రమము గట్టి
కొని తపమొనరించు కొనుచుండెను. అపుడు భార్య యేమై
నది? సంసారమేమైనది? ఈ విషయములనాతఁడు "ఈషణ
దూషణ మొనర్చి" (పాం. ద్వి. ఆ. 28) అనునొక ముక్కతోఁ
దేల్చివేసెను. కొడుకులు 'ప్రబోధ విధేయమతులు'. తండ్రికి
పుత్రేషణము లేదు. దారేషణ మంతకుముందే లేదు. కాని
యామె 'యప్రతీపమతి' యగుటచే-భర్తృసేవ లొనర్చుచు
నాశ్రమమునందే యుండెనని మనమూహించికొన వలెను.
దీనికిఁ గావలసిన సామాగ్రి నంతయు - ముందే ధ్వనింపజేసి
నాఁడు - కవి. ఇట్టిదే నిగమశర్మో పాఖ్యానమునఁగూడ
నొక్క విషయముగలదు. కాపుజవరాలితో నాతఁడు గాపు
రము సేయుచుండెను. ఆమె మరణించినది. వాఁడొక ప్లవ
కన్యను బట్టెను. తరువాత కవి యిట్లన్నాఁడు - "అపవిత్రం
బగు పుత్రలాభంబు తత్కళత్రము నందునుసంభవించె"
(పాం. ఆ. తృ. 89) ఇక్కడి సముచ్చయార్థమును బట్టి -
పైదాని యందును సంతానప్రాప్తి గలిగెనని మన మనుకొన
వలెను. ప్లవకన్యయింటిలో సవతి కొడుకులకును-ఆమెకును
పొత్తు కుదురకపోవుట - దానివలన గలిగిన కష్టములన్నియు
మనమే యూహింపవలె! కొన్ని విషయము లాతఁడు చెప్పక
గాలికి వదలుటయుగలదు. పుండరీకుఁడు - తల్లికిని దండ్రికిని -
ప ర మా న్న ము లు - తాలింపులు - పూపములు -
(పాం. ద్వి. ఆ. 24) పెట్టెననియించు. మరి పుండరీకుని విషయ
మేమి? వాఁడు భుజింపఁడా? ఈ విషయము - కవి దృష్టిలో
స్వల్పాల్పము. నిగమశర్మకుఁ దమ్ములున్నారు. వారేమైరి?

వాని తల్లి దండ్రులు? ఈ ప్రశ్నల కాకథలోనుత్తరములేదు. వీరి భవిష్యత్తు నంతయు – మనము చిత్తము వచ్చినట్లూహించి కొనవచ్చును. ఇంతమాత్రమేగాదు. నిగమశర్మ యొనర్చిన పాపములను – కవి యిట్లు వర్ణించినాడు.

సీ॥ లలనాధరోష్ఠ లాలాజలాన్వితముగఁ
గ్రోలె మద్యము పేరికులమునెల్ల
వావివర్తనల తావావంతఁ దలఁపక
కన్నిచ్చవడఁ జేసె గామవికృతి
జనులు ప్రవ్వఁగఁ దిట్టపడి కోర్చి యార్జించెఁ
బశ్యతోహరవృత్తిఁ బసిఁడిప్రోగు
కన్నపెట్టియుఁ ద్రోవగాచి కొట్టియుఁజంపె
లెక్కకు మిగులు భూలేఖవరుల
తే॥ గీ॥ మఱియు నీరీతిఁ గూరులమైత్రివడసె
నితరపాతకములు చేసె నెన్నియేని
వీనిఁ బొదువుండుకట్టుఁడు – వేయుఁడనుచు
జముని దూతలు బాధింప జడిసి యతఁడు.

(పాం. తృ. 120)

పైని జెప్పిన వానిలో కొన్ని పాపము లేనన్ని వేళముల యందాతఁడొనర్చెనో మనకుఁ దెలియదు. ప్రతిభ – చపలతనుగూడ – పెంచుననుట కిట్టి యుదాహరణము లేసాక్షి! అనవసరములు గొన్ని వదలివేయుటయు నాతనిశక్తి. పుండరీకుఁడు దల్లి దండ్రుల కొనర్చిన సేవ బ్రహ్మాండముగ వర్ణించెను. ఇంతలో వారు మరణించిరి. రామకృష్ణుఁడు వెంటనే–

క॥ పరలోకావాససుఖా
దరపరతం జనిన తల్లిదండ్రుల కొసగెన్
గురుభక్తి నిగుడు కొడుకతి
కరుణాహుతి గంగనస్థిగయఁ బిండంబున్ ॥
(పాం. ద్వి. 25)

అని వర్ణించి వారి పారలౌకిక క్రియలను – ఒక పద్యపాదమున ముగించి – చేతులుగడిగి కొన్నాఁడు. ఇట్టి వెన్నియో ప్రత్యేకత లాతని కథారచనమందు కనుగలిగి చూచినచో మన యెదుటఁబడును. నాటికవులలో సమాజముతో నెక్కువ సంబంధముంచికొని – వారి కష్ట నష్టములతోఁ బాలుపంచుకొన్న కొందఱు కవులు గలరు. వారిలో రామకృష్ణుఁడొకఁడు. పెద్దన్నగారి కవితావిలాసము – ధనికుల భోగములను వర్ణించుటతోనే చరితార్థమైపోయినది. ముక్కుతిమ్మన్నగారి లేఖిని – కృష్ణరాయని యంతఃపురమును విడచి గడ్డకే రాలేదు. వసుచరిత్రకారుఁడు సరేసరి! కనులు దెఱచినదితడవు– ఆతని చూపులు – రత్నకూటముల పైనేబడును. రామలింగఁడట్లుగాక – రాయలవలె నాటిజనుల యాచార వ్యవహార ములను – గొంత వివరముగ దెలిపెను. రాయలవలె గాక– కొంతసానుభూతితో వర్ణించెను. తక్కువ జాతులకుఁ జెందిన యాచార వ్యవహారములు – సుఖ దుఃఖములు వీనిపైఁగూడ– నాతనికి గొప్ప సానుభూతి యున్నది. నిగమశర్మ కథలో 'జాతర' వచ్చినది. 'గాలిగంగల' తృప్తికై యొనర్చు పండుగ యిది. అది వచ్చినదే – పల్లెజనులకెంతో సంబరము.

పామర ప్రమదల కింకను - ఆనందము. ఇట్టి యుత్సవములలో నే - వారిస్వేచ్ఛాప్రవృత్తి కొంత నిరాటంకముగ సాగును. ఈ జాతరలో - వారి యుపనాయకుల సంకేతస్థానములు. ఇట్టి వర్ణనములు కొన్ని - గాథా సప్తశతిలో వచ్చును

జాతరలో నా 'పామరప్రమదలు' గోరువెచ్చని చమురంటు కొన్నారు. 'నిశామిళితవారి' లోఁ దానములాడిరి. సింధూర తిలకములు పెట్టుకొని - కన్నులకుఁ గాటుకలు దీర్చికొన్నారు. 'సిక్క కొప్పులలో విరులు గ్రుక్కుకొన్నార'ట! వెట్టి మొట్టిగాఁ దురుకుకొన్నారని యర్థము! వేపచిగుళ్ళ మాలికలు వేసికొన్నారు. "తరుణధావన ధగ ధగద్దశన మణులపై - లేఁతవీడ్యములడాలు - హత్తుకొల్పిరి" విజయనగర జనులకు - తాంబూల చర్వణము - పెద్దయలవాటు. విదేశ రాయబారులందరును - వారి తాంబూల సేవనమును పెద్దగ వర్ణించిరి. పెద్దనామాత్యులు దీనిలోని మఱియొక రహస్యమును గూడ దెలిపినారు. మనుచరిత్రలో -

క॥ మృగమదసౌరభ విభవ
ద్విగుణిత ఘనసారపటిమ వీటీగంధ
స్థగితేతర పరిమళమై
మగువపొలుపుఁ దెలుపు నొక్క మారుత మొలసెన్॥

అని వారు వర్ణించిరి. నాటి స్త్రీలు తాంబూలములో - ఘనసారమును - మృగమదమునకన్న - రెండింతలుగ వాడెడువారట! అందుచే నాగాలి "మగువపొలుపు దెలిపి"నది.

తెన్నాలికవి 'పామరప్రమదలు' - జాతరలో - జెల్లించు మ్రొక్కుబడులను గూడ నిట్లు వర్ణించినాఁడు.

సీ॥ అంభోధరము క్రిందనసియాడు నైరావ
తియుఁబోలె సిడి వ్రేలెఁ దెఱవయొకర్తు
చెందమ్మికొలన రంజిల్లు నంచయుఁ బోలె
నిప్పు పేటఁ జరించె నెలఁతయొకర్తు
తొలుసంజ మొడ వర్తిలు జక్కవయు బోలె
నీఁగెఁ బందిరి గుండనింతియొకర్తు
జలసీలిపై నెక్కు కలువ మొగ్గయుఁబోలె
ననఁటాకు నర్తించె నతివయొకర్తు
తే॥ గీ॥ కాంతయొక్కర్తు మూపునఁ గండలిచ్చె
నూరుగాలిచ్చె నొక సుధామధురవాణి
లలనయొక్కర్తు నోరి తాళంబులిచ్చె
శక్తిజాతర సద్భక్తి శక్తు లెసఁగ ॥
(పాం మ. తృ. 77)

ఈ యాచారములను — నేటి నాగరికత — యిప్పటికే చాలమట్టుకు మ్రింగివేసినది. ఇఁకఁ గొంత కాలమునకు వీనిని బూర్తిగా — మఱచిపోదుము. నేటికే — యీ యాచారముల కర్థము — వ్యాఖ్యాన సాపేక్షమైనది.

నిగమశర్మము మందలించుచో — వానియక్క —

ఉ॥ కామవికార మాత్మనవ గాఢతఁ దాల్చినయేని నిర్భర
శ్రీమెఱయంగ రూప గుణశీలకులోన్నతిగల్గు విప్రక
న్యామణులన్సహస్రమయిన న్వరియించి రమించరాదె యే
మీ మనుమైై గృహస్థులురమించుట యెగ్గె కులాంగనా
తతిక్ ॥
(పాం. తృ. ఆ. 41)

అని తమ్మునివైపు 'వకాలతు' పుచ్చుకొన్నది. విజయ నగర సామ్రాజ్యదినములలో-నీయాచారమునకుఁ దప్పులేదు. రామకృష్ణుని దృష్టిలోఁగూడ తప్పుకాదు. సమాజము ప్రవాహము - అభిరుచులు పరిణామ శీలములు. నాటి గుణము - నేఁడు దోషము. నేఁటి గుణము - నాఁడు దోషము. వీనివెలలను - 'ఇదమిత్థమని' తేల్చి చెప్పుట కష్టము. పుండరీకుని బ్రాహ్మణ ధర్మమును గూడ కవి పెద్ద సీసపద్యమున (పాం. ద్వి. ఆ. 6) వర్ణించినాఁడు కవి. నాఁడు చరిత్రమును బట్టి జూచినచో - బ్రాహ్మఁడిట్లున్నాఁడనుటకంటె నుండవలె ననుటయే కవి యాశయమైనట్లు దోఁచును. ఆ పద్యమీక్రిందిది.

సీ॥ చలిచీమ నేనియుఁ జాఁద్రొక్క శంకించుఁ
బలుకఁడెన్నఁడు మృషాభాషణములు
కలుష వర్తనులున్న పొలము పొంతఁజనండు
కలిమికుబ్బఁడు లేమికలఁగఁడాత్మఁ
దలయెత్తిచూడఁ డెవ్వలనఁ బరస్త్రీల
దైర్వ్యంబువిడఁ డెట్టి దద్దఱుటల
నొరుల సంపదకునై యుపతపింపఁడు లోన
వెందింపఁ డెంతటి నీచునైన
తే॥ మిన్నకయచూడఁ డాకలి కన్నకడుపు
సర్వభూతదయోదయోత్సవమొనర్చు
నిగమ ఘంటాపథైకాధ్వనీనబుద్ధి
బ్రహ్మవిద్యానవద్యుండు - బ్రాహ్మణుండు ॥
(పాం. మా. ద్వి. ఆ. 6)

విజయనగర సామ్రాజ్య చరిత్రనుబట్టి చూచినచో— అంతకు చాలదినములకుముందే – విప్రులు క్రమక్రమముగ– దిగజారిపోయి యుండిరి. వారు సంపూర్ణముగ లౌకికులై పోయినారు. విద్యారణ్యుల కాలము నాటికే – బ్రహ్మ క్షత్ర జాతి బాగుగ నాటుకొన్నది. విద్యారణ్యులు మొద లైన వారుగూడ – దేశావసరమునుబట్టి యా సంప్రదాయ మును ప్రోత్సహించిరి. భారత యుద్ధముననే – కొందఱు విప్రులు కత్తిబట్టి యుద్ధ మొనర్చినట్లు – మనకు కథ లున్నవి గదా! విద్యారణ్యులు – మాధవమంత్రి – సాయణులు – మొదలైనవారందఱును విజయనగర రాజులకడ మంత్రిపదవు లొనర్చిరి. మనస్వులైన విద్యారణ్యులు మంత్రిగానున్నను – తపస్వులై – జీవితమున కొంత – విప్రధర్మమును నిలిపికొనిరి. దేశికులు – అక్షోభ్య తీర్థులు – మొదలైనవారు దేశారిష్ట మును గమనించినను – రాజకీయములలో ప్రముఖపాత్ర వహింపరైరి. రాగరాగ – విప్రులు – పూర్తిగ లౌకికులై పోయినారు. తిమ్మరుసు మహామంత్రి. ఆయన రాజకీయ జీవ నము దెలిసినంత – మన కాయన యాధ్యాత్మ జీవితము దెలియదు. విద్యానగర చరమకాల రాజులలో – అందరి కంటెను కొంత యెక్కువ బ్రాహ్మణ భక్తిగలవాఁడు కృష్ణ రాయలు. ఆతనికి విప్రులయెడనున్న వినయము – 'ఆముక్త మాల్యద'లోని రాజనీతి వర్ణనములో మనకు గానవచ్చును. దుర్గములు – 'ఆప్తద్విజవర్గము'నకే యివ్వవలెననుట – రాయ లిచ్చిన సలహా! ఆతని కాలమున ప్రముఖ దుర్గాధిపతు లందఱు బ్రాహ్మణులే! రాయమరుసు – అయ్యమరుసు –

కొండమరుసు - మొదలైనవారందఱు - విప్రులు. గోపన మంత్రి - కొండవీటి దుర్గాధిపతి. విప్రులకే - యీ యధికారము నెందులకీయవలెనో - రాయ లీక్రింది పద్యమున వివరించి నాఁడు.

తే॥గీ॥ బాహుజాంఘ్రిజముఖ విడంబనకునైన
కొలిచిమను - విప్రధర్మంబు దెలిసినైన
పూని సంకటముల నిల్చుగాన తఱచు
బ్రాహ్మణుని పరిభుఁజేయుట - పతికి హితము
( ఆ. చ. ఆ. 217 )

క్షత్రియులు శూద్రులు మొదలగువారు తన్ను తప్పఁ బట్టుదురనియో -- లేక - రాజసేవ యొనర్చి కాలమును గడపవలెనన్న విప్రధర్మమును దలంచియో-బ్రాహ్మణుఁడు- సంకటములలోనైనను రాజును వదలఁడట! అందుచే నాతని కధికారము నీవలెనని ప్రభుని హితము! త్రివిధములైన యుత్పాతములు గలిగినపుడు - అవనీసురులను - దేవతలను- అగ్నిని - భుక్తిబలి హోమవిధులచేత ( ఆ. చ. ఆ. 253 ) తృప్తిపెట్టవలెనట. ప్రాతఃకాలములందు నృపుఁడు కార్తాంతిక ద్విజులతోఁ గడుపవలెననియు-ఆయన యేర్పాటు జేసికొన్న నియమము! రాయలతరువాత - విప్రుల పెత్తనము పోయి నది.

ఆరవీటిరాజుల కాలములో - బ్రాహ్మణులు ప్రముఖ పాత్రను వహించునట్లు గానరాదు. వారికే - మంత్రిపదవులు

గూడఁ దప్పిపోయినవి. అందుచే - పుండరీకుని బ్రాహ్మణ ధర్మమును వర్ణించు వ్యాజముతో — విప్రుఁడిట్లుండవలెనని రామకృష్ణకవి - తెలుపుచున్నాఁడా! యనియు నా యనుమానము.

ఇఁక మిగిలినవి — రామకృష్ణుఁడు సృష్టించిన స్త్రీపాత్రలు. వీరిలో నాతఁడు కొందఱిని - సంపూర్తిగ నుపేక్షించినాఁడు. వారి కింకను గొంత స్పష్టముగ రూపకల్పన మొనర్చియుండినచో -.బాగుండెడిది. అట్టివారిలో - పుండరీకుని — భార్యయొకతె! ఆమె 'గృహమేధి వతంసము' 'అప్రతీపమతి'. తా నొకతెయైనను - పరిచారికా సహస్రమై-పితృయుగమును సంభావించు కార్యమునందు — పుండరీకునకుఁ దోడ్పడిన - ధర్మమును కర్మమును గల - దొడ్డయిల్లాలు. రామకృష్ణకవి - ఆమెను తరువాత సంపూర్తిగ నుపేక్షించినాఁడు. పుండరీకుని తల్లిదండ్రులు — గతించిన పిదప - నామె యొనర్చిన పని యొక్కటే! సంతానమును గనుట! పుండరీకుని తపశ్చర్యలో నామె పాత్ర యెట్టిదో మన కాతఁ డెఱింగింపనే లేదు. అతఁడు భగవంతుని దరిసించిన తరువాత — ఆమెగతి యేమయ్యెనో - చెప్పవలసియుండెను. అదియు నాకవి చెప్పినవాఁడు గాఁడు. ఇది చాల యన్యాయము. ఇట్టి యన్యాయమునే — రామకృష్ణుఁడు—నిగమశర్మ భార్యకుఁగూడ నొనర్చినాఁడు. ఆమెది నిజముగ - చాల జాలిగొలిపెడి జీవితము, ఆమె అత్తవారింటికి వచ్చునప్పటికి - భర్తకు నూనూగు మీసాల ప్రాయము. తా నంతకన్న

చిన్నదిగదా! తన యౌవనము - వానికి ముట్టరాని కూడై నది. ఆమె పాలిండ్లు వానికి రిక్తకుంభములు. ఆమె ఫాలము చవితి చందురుఁడు. మనసార నామెను కౌఁగిలించి యెఱుఁగడు. ఆమెకా! 'అనివార్య జృంభణమగు యౌవనారంభము.' ఇంతటి యుద్రేకమునుగూడ నా సాధ్వి — గంభీరముగ నడఁచికొన్నది. 'వనచంద్రికా వైభవమును' - 'వన కేళీపలాశ కోహదము'ను - అయిన తన యౌవనపు మాటనే మఱచి ఆ మహాతల్లి — 'అత్తమామల చిత్తంబు వచ్చునట్లు' 'భక్తి శక్తులు మెఱసి పాటులంబడుచున్న'దట! ఇంతలోనొకనాఁడు మగఁడు వచ్చెను. అప్పుడామె - ప్రాణేశ్వరుని శ్రీపాద ద్వయిని శీతలవారితోఁ గడిగినది. ఆ కడుగునప్పుడు - నిజ నిశ్వాసములతో — చల్లనినీరు కొంతకొంత తప్తమైనదట! ఇంతమాత్రమే - ఆ యిల్లాలు — తన మనోవేదన కొసఁగిన బాహ్య స్వరూపము. ఆనాఁడు — ఆ యొకనాఁడు — భర్త కామె విశ్వమును జట్టెయిచ్చెడు నదృష్టమునకు నోఁచు కొన్నది. ఆమె యొనర్చిన మఱియొక పని — వదినెకు విడె మొసఁగి - పసిడి వీవనతో వీఁచుట! ఇంతదప్ప ఆ సాధ్విని గూర్చి మఱి యేమియు నెఱుఁగము. ఆమె మనోవేదన నింకను గొంత స్పష్టముగ వర్ణించియున్నచో - తెన్నాలికవి యామెను న్యాయము జేసినట్లుండెడిది. ఆమె గాంభీర్యము చాల గొప్పదే! దానిని ధ్వనింపఁజేయుటకే — కవి యామె మనోభావములను వర్ణింపలేదని సరిపెట్టుకొన్నను — తరువాతి కథలో నామెగతి యేమయ్యెనో చెప్పకపోవుటమాత్రము — అతఁ డొనర్చిన గొప్పయన్యాయము.

రామకృష్ణుఁడు సృష్టించిన గొప్ప స్త్రీ పాత్రములు రెండు. మొదటిది నిగమశర్మ యక్క. రెండవయామె సుశీల! నిగమశర్మ యక్కనుగూర్చి - శ్రీ రాళ్ళపల్లి అనంత కృష్ణశర్మగారు - ఇతరులకీ విషయమును మిగులనివ్వక - చెప్పవలసినంతఁ జెప్పివేసిరి. ఇఁక మిగిలినది సుశీల! ఆమె భర్త పరమ లోభి! అంతేగాదు, గర్వపర్వత మస్తక స్థితుఁడు. జగడములే వాని భోజనము. ఆమె 'దాడ్డగజిత' గావుననే - 'అటువంటి మగనితోఁ గాపురము జేసినది.' తాళిగట్టిన దినము మొదలుకొని - వాని కామెను గొట్టుటయే పని! సూర్యుని వేడికోర్చి జీవించు ఛాయాదేవివలె - నీమె వానితోఁ బ్రదికినది. నిగమశర్మ అక్క కథ వేఱు. ఇంటిలో నామెభర్త, మగఁడు భార్య! సుశీల బ్రదుకంనుకు నేరుగా విరుద్ధము. "ఆమెది తాటిపై తపము." ఇన్ని దుర్మార్గములు భర్త చేయుచున్నను - సుశీల జీవితేశ్వరు నీశ్వరుగాఁ-దలఁచుచుండినదట! "తదుపాసనము - తనకు నిహాపర శుద్ధిసూచకమ"ని లోకముకొఱకుగాక - వాని సేవను నిండు డెందముతోఁ జేయుచున్నది. ఇది యామె - జీవితమున సాధించిన మహాయోగము. ఒకనాఁడు భర్త యూరలేఁడు. గ్రామాంతరమున కేఁగినాఁడు. ఒకానొక వటువు వచ్చెను ఆ వటువుతో నామెయొనర్చిన సంభాషణమును-రామకృష్ణుఁడెంతయో చక్కగా పొందించెను. నిగమశర్మ యక్కలో నున్న సన్నాహ - సామర్థ్యము లీమెలోఁ గానరావు. సుశీల జీవనము ధర్మైకపరము. గృహిణీ ధర్మములన్నియు నామెలో బాగుగా - కావలసినంతకన్న యెక్కువగ - ప్రతి

ఫలించినవి. నిగమశర్మ అక్క తరువాత - సెన్నదగిన పాత్ర లలో సుశీలయే మొదటిది.

రామకృష్ణకవి యనర్ఘమగు సామర్థ్యమును మన యెదుట నిలిపి పోయెను. శక్తికొలంది - ఓపికకొలంది - దాని నర్థము జేసికొని - యనుభవించి - యానందించుటయే మన పని. దానినే నే నింతవరకొనర్చినది.



# రామకృష్ణవిహాస్యము



నవ్వుమానవునకు భగవంతుడనుగ్రహించిన యొకగొప్ప వరము. అది యమూల్యము మాత్రమేకాదు. ఆవశ్యకము కూడ. దీకితోడిసంబంధము మనకుఁజాల పురాతనమైనది. ఈమాట యెందుకంటివనఁగా - శృంగారవీరములు - అద్భుత హాస్యములు మొదలగు కొన్నిరసములు - ఆదిమానవునకు జాలదగ్గఱివని తోచును గనుక వీనిలో బహుజనాదరణ మును బొందినదేది? యనువిషయమే చర్చకు వచ్చినచో- అగ్రతాంబూలము హాస్యమునకే. జీవితమున మనకన్న గొంతరసికులైనను మహర్షులకు-శృంగారమన్నచో—చింత కాయగొఱికినట్లే. కాని వారికిగూడ హాస్యముతోడివిరో ధము లేదు. మనస్వియైనవాల్మీకికి మందహాసమెప్పుడును. బెదవులపైననే యుండెడిదని—వారిరచనావిధానమే దెలుపును. మనమాటకేమిగాని భావప్రపంచమున మనకంటె నెంతయో దూరముననున్న పశుపక్ష్యాదులకుఁగూడ నగవుప్రియమై నదే. మనస్సున్న యేపదార్థమునకైనను తత్కృతమైన యుల్లాసము—ప్రియమైనదేల కాకపోవును? అన్నిజంతువుల యందును మనకీగుణమంతస్పష్టముగ గనుపింపదు. వాని హావభావములను గమనించి గుర్తించుట మనమింకను నేర్వ వలసినవిద్య. ఆజంతువులు దమభావముల నెట్లావిష్కరిం

చునో-వానితీరు తీయములు - ఇంకను మనయూహాకందుట లేదు. కోతులు, అడవిమనుష్యులు మొదలగువాని భావా విష్కారము గొంత మనయూహాకందును. అందులకేగా బోలు మనపురాణములలో-కుక్కలు నక్కలు నవ్వినకథలు గొన్నియున్నవి. మాటాడిన సన్నివేశములకు లెక్కయే లేదు. బలిచక్రవర్తి దేవేంద్రునకోడిపోయినాడు. అతడు పాతాళమును జేరి గాడిదయై యుముకదినుచు కాలమును వెళ్లబుచ్చుచుండెను. బలికీదన దర్జాచూపింపనిది విజయగర్వితుండైన సహస్రాక్షునకు నిద్రపట్టలేదు. 'బలిచక్రవర్తియెక్కడనున్నా' డని యాతడు బ్రహ్మనడిగెను. పాతాళముననున్నాడని పరమేష్ఠిబదులువలికెను. దేవేంద్రుండు వెంటనే యచ్చటకేగి-తనవిజయగంధమును బ్రసరింపజేసినాండు. పశురూపముననున్న బలి-దేంవేంద్రునింజూచి నవ్వెనట! బలిచక్రవర్తి దేవజాతివాడైనను నవ్వినది గాడిదమూతితోనేగదా! ఏల గారాదు? మనకున్న కామము, క్రోధము మొదలగునన్ని వికారములును-పశుపక్ష్యాదులలోనుండుట మనమెఱింగినదే. అట్టిచో నవ్వునుమాత్ర మేల యవి బహిష్కరించి యుండును? కాని వాని బాహ్యజీవితము మనకంతయోయింతయో దెలిసినను-ఆంతరికజీవనముమాత్రము మనకీనాటికిని-అయోమయప్రపంచమే. అందుచేనింతవఱకు మన మొనర్చిన సిద్ధాంతములు వట్టియూహాయే.

మానవులమైన మనకుమాత్రము నవ్వుచాలప్రియమైనది. ఆపదార్థమనువదియే లేకయున్నచో బ్రతుకుబరువున

నేనాశో క్రుంగిపోయి యుందుము. ఇప్పుడిప్పుడొక క్రొత్త నాగరికత మనల నావరించికొనుచున్నది. నవ్వవలసిన సన్నివేశము లేర్పడినప్పుడు గూడ — నవ్వినచోఁ బరువు బోవునని పండ్లు బిగించికొనియుండు కొందఱు పెద్దమనుష్యులను నే నెఱుఁగుదును. వీరి దృష్టిలో నిండుగా నవ్వుట లఘువర్తనము. మన నవనాగరికత నేర్పిన యనేక దుర్గుణములలోన హృదయవంచనగూడ నొకటియని నా యూహ. ఉత్తర హిందూస్థానమున నొకసారి యొక పండితుని దర్శించితిని. తులసీ రామాయణముపై నాతఁడు వ్యాఖ్యానమును రచింపఁ బూనుకొనెనట! ఆపనిలోఁ దనకున్న యసాధారణ యోగ్యతల నెన్నిటినో యాతఁడు చెప్పికొనుచు వచ్చెను. ఆ స్వాతిశయ భావము నాకుఁగొంతవిసుగు గల్గించినను 'బండితుల కిది మామూలే' లెమ్మని సరిపెట్టుకొంటిని. తన యోగ్యతల చిట్టాలో నాతఁడు మరియొక యపూర్వ విషయమును దూర్చినాఁడు. ''తులసీదాసుపై వ్యాఖ్యానమును వ్రాయ నారంభించిననాఁటనుండి నవ్వుటయే మానివేసినాఁడ''ట! అనఁగా నాటనుండియే రాముని గాంభీర్యగుణము నా వ్యాఖ్యాత సర్వాత్మగా త్రాగివేసి స్వాయత్త మొనరించికొనెనని యర్థము. ఆ పండితుని వాక్యములు విన్న తరువాత తులసీదాసుపై నాతడు వ్యాఖ్యానమును వ్రాయకున్న బాగుండునని యనిపించినది. కారణ మేమనగా తులసీదాసెన్నఁ జేని భావించియుండని క్రొత్తక్రొత్త ధ్వనుల నా వ్యాఖ్యాత యూతనిలోఁ ద్రవ్వునని నా భయము. అదు గడుగునను నవ్వుట యెంత హానికరమో — బాత్తిగా నవ్వక

జొమలు ముడివేసికొని యుండుటగూడ నంతే. తెనాలి రామలింగనికడకు - ఒక కవి యొక పద్యమును వ్రాసికొని వచ్చెను. ఆ పద్యార్థమిది. "పతివ్రత పతికి మారాడక - పలుమరు నేడ్వక యుండవలె" నట! ఈ చరణమును విని రామకృష్ణుడు - ఎంత పతివ్రతయైనను అప్పుడప్పు డేడ్వ వలసిన దేనా! యని యాక్షేపించెను. ఏడ్పువిషయమున నెట్లున్నను - నవ్వులో మాత్ర మీ విషయ మింతే. బ్రతికిన మనుష్యు డప్పుడప్పుడు నవ్వును. మేము నవ్వమని బాసిక పట్టువేసికొన్నవా రభాగ్యులు. వారిని జూచి మనము జాలి పడవలెను.

మానవ సామాన్యమునకు నగవు ప్రియమైనదని మనవి చేసితిని. కనుకనే మనము సృష్టించుపాత్రలకుగూడ దీనినా రోపింతుము. అప్పుడు దాత్కాలికముగ మన విచక్షణా జ్ఞానమును గొంత ప్రక్కకు బెట్టుదుము. మన హనుమంతుడు నవ్వును, వినాయకుడు నవ్వును. విహగనాథుడు నవ్వును. నవ్వు వారి మొగముల నందగించునా! లేదా! యన్న సమ స్యయు మనకుంగాబట్టదు. మనవలెవారుగూడ నవ్వవలెనంతే. దీనివిషయమునసేకాదు ప్రతిభావమందును మన తీరిదియే. నీతిచంద్రికలో వచ్చుపాత్రలన్నియు బశుపక్ష్యాదులే. కాని వానిలో మనగుణములన్నియు నారోపితములైనవి. ఇవి యారోపితములని మనకుం దోచనేదోచదు. సత్యములైనట్లే నమ్మి చదువుదుము. దీనికింగారణమేమి? సాజాత్యములో నంతగారడియున్నది. అదిసానుభూతిని సృష్టించును. పింగళి

సూరన్న యౌచిత్యములో నందె వేసినచేయి. అతడుగూడ శుచిముఖిచే నవ్వింపక మానలేదు.

మ॥ అనుడుం నవ్వి మరాళి యిట్లనియె చెల్వా! కాముం
డన్నాని మీ
రును విన్నారుగదమ్మ! (ప్రభావతీ ప్రద్యుమ్నము
3-121 )

అనంగా - దీనిబలమెంతటిదో మనమూహింపవచ్చును.

నగవు మనకు గలిగిన మనోవికాసమునకు గురుతు. ఒకపదార్థము-ఒకసన్నివేశము-వీనిలోని వైచిత్రిని గమనించినప్పుడు మనకు నవ్వువచ్చును. ఈవైచిత్రిలో సూక్ష్మముగ నాశ్చర్యముగూడ భాసించును. అన్నిరసములను భావించుటకు - ఒకానొక చైతన్యమెట్లవసరమో హాస్యమునకుగూడనంతే. ఆచైతన్యము లేనప్పుడు—లేక చాలనప్పుడు-హృదయముపై హాస్యమేమియు బనిసేయదు.

సామాన్యులకు శృంగారమువలెనే హాస్యముగూడ వీడరాని బంధమంటిని. ఇది కేవలము చాపల్యముమాత్రమే గాదు ; ఆరోగ్యకారకముగూడ. ఆయుర్వేదమే యీవిషయమును స్పష్టముగ జెప్పినది. ఇకప్రయోజన దృష్టితో జూచినచో—హాస్యముతోడి లాభముల నడుగడుగునను ననుభవించుచునే యున్నాముగదా ! ఈదృష్టితో నీరెంటును మనజీవితమున కింతగాంగావలసినవి గనుకనే - శృంగారము

మొదలైనవానిని మన వేదాంత మొంతగా దిట్టిపోసినను మనమా దరింతుము. ఆపవిత్రగ్రంథములలోనే_'ఈ రెంటిని మితముగా ననుభవింపవచ్చున'న్న ముక్కను దగిలించి - వానిసమ్మతిని సంపాదించికొని తృప్తిపడుదుము. దోషమున్న దానినెల్ల బహిష్కరింపవలెననుచూపు-వేదాంతుల కెట్లున్నను - సామాన్యులకంతగా బనికిరాదేమో యని నా యనుమానము. దోషలేశమున్న ప్రతిదానిని బహిష్కరించుచుఁ బోయినచో నిక ప్రపంచమున మనకుమిగులునది పూర్ణానుస్వారమే.

రసములలో శృంగారమన్నిటికంటెను మనోహరమైనదని యాలంకారికుల యభిప్రాయము. అందుకేవారు దానిని రస సమ్రాట్టుని గద్దెపై కెక్కించిరి. కాని హాస్యమునకున్న ప్రాధాన్యము - శృంగారమునకంటె నేమియు దీసిపోదని నాయూహ. ప్రాచీనాలంకారికులును - ఈవిషయమును గమనింపకపోలేదు. గమనించిరిగనుకనే శృంగారము తరువాత హాస్యమునకే వారు పట్టాభిషేకము జేసినారు. ఈ రెండురసములకును - గార్యకారణభావ సంబంధమును గూడ వారుగల్పించిరి. దీనిపరమార్థము నాకింకను బోధపడలేదు. అనగా శృంగారముచేత గలుగు మానసికోల్లాసమే యాస్వాదనీయమైనదని వారియభిప్రాయమేమో ! హాస్యముయొక్క యధికారపరిధినింత సంకోచించుట నాకుజూడనన్యాయమే. ఈక్రింది పద్యమును గమనింపుడు.

శా. ధరకెంధూళులు కృష్ణరాయలచమూధాటీగతిన్ వింధ్య గ
హ్వరముల్ దూఱఁగజూచి తారచటగాపై యుండుటల్

జాలన

చ్చెరువై యెట్టని వింతచీకటులు వచ్చెంజూడ రేయంచు వే
సొరిదిఁ జూతురు వీరరుద్రగజరాట్ఛుద్ధాంతముగ్ధాం
గనల్

రాయలు గజపతిని దఱుమనారంభించెను. సకుటుంబముగ
వాడు వింధ్యకాంతారములోనికిఁ బరువెత్తి — యా గహ్వర
ములలో దాఁగికొన్నాఁడు. అంతయైనను సమరాంగణసా
ర్వభౌముడు వానిని వదలలేదు. రాయలసైన్యధుతధూళి
'వింధ్యారణ్యముల నాక్రమించినది. గజపతి భార్యలు -
దానినిజూచి వింతచీకటులని భ్రాంతిపడినారట. వారు ముగ్ధ
లుగనుక నీ భ్రాంతిలో నాశ్చర్యము లేదని పెద్దన్నగారు
సమర్థించిరి. ఇంతటి ముగ్ధలు ప్రపంచమున నేనాడైనను -
ఎక్కడైననుందురా యనుట యాలోచింపదగిన విషయమే!
ప్రపంచముననున్నను లేకున్నను పెద్దనామాత్యులకావ్యము
లో మాత్రమున్నారనియే మనము నమ్మవలెను. అతిశయోక్తి
ప్రియులైన కవులలో సరిపెట్టుకొనవలసిన యనేకవిషయ
ములలోనిదియు నొకటి. వారసూర్యంపశ్యలుగదా ! ఆశు
ద్ధాంతముగ్ధాంగనలను పట్టుకొన్న భ్రాంతితో మనకుఁగొంత
చిఱునవ్వు మొలచును. ఇంతకంటె గొంతస్పష్టముగ నాము
క్తమాల్యదలో నగవుభాసించుచున్నది.

మ. తలపక్షచ్ఛటఁగ్రుక్కి బాతువులు కేదారంపు కుల్యాంతర
స్థలినిద్రింపగజూచి యారెకులుషఃస్నాతప్రయాత ద్విజా

వళిపిండీకృతశాటులన్ సవి దదావాసంబు జేర్పంగ రే
వులడిగ్గన్ వెసఁబాఱు వానిగని నవ్వన్ శాలిగోప్యౌ
ఘముల్

శ్రీవిల్లి పుత్తూరులోని కేదారంపు కుల్యలలో నక్కడక్కడ బట్టలుదికికొనుటకు రేవులున్నవి. బాతువులు చంచూపుటముల రెక్కలలో నిమిడ్చుకొని యాచోటులలో నిద్రించుచున్నవి. అవి తెల్లగానున్నవి. వానినిజూచి యారెకులు ప్రాతఃకాలమున స్నానముచేసివెళ్లిన బ్రాహ్మణులు మఱచిపోయిన పంచెలని యనుమానించిరి. విచారించి యావస్త్రములను స్వంతదారులకు జేర్తునని వారు రేవులలోనికి దిగినారు. అవి తుర్రుమని పరువెత్తినవి. ఆరెకుల బేలతనమునుజూచి వరిపొలములలోఁ గాపున్నవయసుగుబ్బెతలు ఫక్కుమని నవ్వినారట ! ఆరెకుల భ్రాంతినిజూచి మనకును నవ్వువచ్చును. రాయలదే మఱియొక పద్యమున్నది. అదియిది.

సీ. కచసక్తఫణికంచుకము మాళిపీన కే
దారంపుభాగ చందంబునొంద
కలయమనంగమున మర్కటకీటకృతమైన
మగ్గంబునేత్రసంపద వహింప
ధ్వాంతగహ్వరశిలా తాడి తాళికచిక్క
నాస్రపంకము చంద్రమై పొసఁగ
తనుభృచ్ఛ్రాంత వేష్టనలగ్న బర్హిబ
ర్హంబు మువ్వన్నెచుంగై వెలుంగ

తే. నిద్రమేల్కాంచి సెలయేట నీడగాంచి
గోపవేషంబు సెడి తొంటి భూపవేష
మగుట యన్వాన మహిమగా నలికి యచటు
విడుచు గజరాజు నీఘాటి వింధ్యవాటి

రాయలకోడి పరువెత్తిన గజపతి వింధ్యారణ్యములలో దిరుగుచుండెనంటిమి. వాడు రాయలుదన్ను గుర్తింపకుండుటకై వేషమును మార్చుకొన్నాడు. గోపవేషమును ధరించినాడట! కాని వానికి మఱల భూపవేషమే సంక్రాంతమైనది. వాని తలకు పాములకుబుసములు చుట్టుకొన్నవి. అవి కేదారపాగవలెనున్నవట! సాలీనిగూండ్లు శరీరమున కంటినవి. అవి వస్త్రములవలె నున్నవి. వెనుక ముందు చూడక పరువెత్తి పోవుచున్నపుడు - ఎదుటనున్న గుహాలతాలు నొసటికి గొట్టుకొని ఎక్కనైన రక్తము గారినది. అదిసిందూరపు బొట్టువలె నున్నది. అలసిపోయి యొకచోట నిద్రించినాడు. ఆ నిద్రలో నిటునటు బొరలుటతో గొన్ని నెమలిపురులు శరీరమునకంటుకొన్నవి. అవిముద్వన్నె చుంగుగా బ్రకాశించినవి. నిదుర లేచిన వాడు సెలయేటిలో దననీడజూచికొన్నాడు. వానికడవిలో నద్దమెక్కడవచ్చును? తొంటిగోపవేషము చెడిభూపవేషమేర్పడినది. ఇది వనమహిమయని దిగులుపడి వాడాయడవిని విడిచి పరువెత్తినాడట! ఇది రాయలొనర్చిన బ్రహ్మాండమైన కావ్యకల్పన. తలకంటుకొన్న పాముకుబుసము మొదలైనవానిని జూచి భూపవేషమేర్పడినదని తలచుటతో గజపతి వ్యక్తిత్వమేపోయెను. వాని యీభ్రాంతిని దలచికొని మనకుగొంత

నవ్వుగలుగును. రాయల కోడిపాటలో వానితోండర-వేషముమారుట యవ్వనమహిమగా దలచినవాని బేలత నము-మనకు మఱికొంత నవ్వును గలిగించును. కాని యీ హాస్యము లోకసహజమైనదది కాదు. గాలిలోగట్టిన మేడ. ఈపద్యమున నింకొక చిన్న చమత్కారమున్నది, దానితో మనకు గలుగునది నిజమైన నవ్వు. అదియిది : రాయల శత్రువు గజపతి. గజసైన్యము నెక్కువగాఁ బోషించుటచే వానికా పేరు గలిగినది. ఈ శబ్దమును గైకొని రాయలు వానిని 'గజరాజ'ని యెత్తిపొడిచినాడు. ఒకపెద్ద యేనుగ యని రాయల యభిప్రాయము. గజరాజు వింధ్యవాటులలో దిరుగుటయు సముచితమే. రాయలొనర్చిన యీయెత్తిపొడుపుతో మాత్రము-నవ్వక మనము తప్పించికొనలేము. భ్రాంతికృతమైన హాస్యమునకు తిక్కనామాత్యులలో నొక చక్కని యుదాహరణమున్నది. భీముడు సైరంధ్రీవేషమున నర్తనశాలలోనున్నాడు 'స్వాంతము బాహుగర్వఘన సంతమసాంధమై'న కీచకుడు-అచ్చటికేతెంచెను. వానికి గామావేశమున గన్నుమిన్ను దెలియుటలేదు. 'అవికార నిగూఢ నిజప్రకారుడై' కూర్చున్న కిమ్మీరవైరి శరీరముపై వాడు చేయివేసెను. 'మదనఘూర్ణమానహృదయుడై'న కీచకుని మేను గఱుపారినది. భీముని సైరంధ్రిగానెంచిన కీచకుడు దనయాత్మస్తుతి నారంభించినాఁడు. దానిని విన్నభీముడిట్లు బదులు పలికినాడు.

గీ॥ ఇట్టివాడవుగావున నీవు నన్ను
బొగడికొనదగు నకట ! నాపాల్కియాడు

దాని వెదకియు నెయ్యెడనైనఁ
బడయ వచ్చునె యెఱుఁగకపలికితిట్లు

కం. నాయొడలు సేర్చినప్పుడ
నీయొడలెట్లగునొ దానినీ వెఱిగెదు న
న్నేయబలలతోఁ డిదిగాఁ
జేయదలంచితివి తప్పుసేసితిగంటే !

కం. ననుముట్టి నీవు పెండియు
వనితల సంగతికిఁబోవువాడవె యైనన్
దను వేపడసిన ఫలమే
కనియెదవిదె చిత్తభవవికారము లెల్లన్

తిక్కనామాత్యుల దృష్టిలో నిది 'చతురోక్తి'. కథలోని పూర్వాపరభాగములు దెలిసిన మనకు భీమ కీచక సంవాదము చదివినప్పుడు నగవు కలిగితీరును. భీముని మాటలు కీచకున కర్థమైన పద్ధతియే వేఱు మనకర్థమగు తీరు వేఱు. ఇది నాటకీయమగు నొక చమత్కారము. ఇట్టివిద్యలలో సోమయాజి యద్వితీయుడు.

చాణుక్యునకును రాక్షసునకును నడుమ పోటీలేర్పడినవి. చాణుక్యుడు వేయునెత్తులకు రాక్షసుఁడోడి పోవుచునే యుండెను. కాని యపుడపుడాయనుత్సాహములోనే వాఁడు నవ్వుకొనును. మనకు గూడ నట్టిసన్నివేశము లప్పుడప్పుడు

గలుగుచునేయుండును. వానిని జాగ్రత్తగా గమనింప మంతే, ఇట్లే యద్భుతము మొదలగు రసములుగూడ హాస్యమునకు పస్ఫోరకములే. మఱి యొక శృంగారము మాత్రమే హాస్యమునకు గారణమని ప్రాచీనాలంకారికు లెందుకు నిర్ణయించిరో తెలియుటలేదు.

వికృతాకార దర్శనముచే నవ్వుగలుగునని యాలంకారికులన్నమాట. అనగా మానవులలో బయటికి గనబడుచున్న యాకృతుల వంకలనుజూచి నవ్వుట హాస్యమని వారి యభిప్రాయము. అంతమాత్రమేయైనచో నందులో హాస్యమే మున్నది గనుక. ఒకవేళ నేకొంచెమో యున్నను నదియుత్తమమైనరకమునకుఁ జెందినదని చెప్పవీలులేదు. ఒకానొక కుంటివాడుండుననుకొందము. వాని కుంటికాలినిచూచి మనము నవ్వినచో నానవ్వు మనబుద్ధియొక్క కుంటితనమును మాత్రమే తెలుపునుగదా! ఒకవేళ తాత్కాలికముగా నేకొంచెమో నవ్వుగలిగినను దానిని వెంటనేయాపికొందుము. ఆపికొనవలెనుగూడ. అవయవములు సరిగానున్నవాడు-కుంటివాని ననుకరించుటలో హాస్యమున్నది. అదియునంత మంచిదిగాదు. మఱి యున్నతముగ-వ్యాపకముగ రసలక్షణమును జెప్పవలసిన యాలంకారికులు హాస్యరసస్వరూపము నింత పేలవముగ నెందుకు నిర్ణయించిరో! వికృతశబ్దమునకు 'వైచిత్రి'యనిగూడ నర్థమును గల్పించికొనవచ్చును. అనగా-వ్యక్తులు-సన్నివేశములు మొదలైనవానిలోని వైచిత్రి హాస్యమునకు గారణమన్న యప్పుడర్థమగును.

వైచిత్రియనగానేమి? సజాతీయములైన వ్యక్తులు, వస్తువులు, వీనికంటె భిన్నముగానుండుట వర్తించుట మొదలైనవి. వైచిత్రిమనకు గొంత నవ్వునుగలిగించును. కాని కలిగించియే తీరవలెనను నియమము లేదు. కొండపీటిలోని యొంటిస్తంభపు మేడ మనము చూడలేదుగాని చూచుటయే తటస్థపడినచో నాశ్చర్యమే గలిగియుండెడిది.

విశ్వనాథుడు హాస్యమున కాలంబనవిభావములు నిరూపించుచు కుబ్జవామన వికలాంగులను బేర్కొన్నాడు. ఇట్లున్న స్త్రీలుగూడనట. అసత్ప్రలాపశ్రవణము హాస్యస్ఫోరకమని యాతడు మఱియొకమాటనన్నాడు. విశ్వనాథుడు హాసము నారు రీతులుగ వింగడించెను స్మితహసితములు విహసితోపహసితములు. అపహసితాతిహసితములు, కాని యివియన్నియు హృదయ ధర్మములే. ఒకనిస్మితమునకు విషయమైనది – మఱియొకని యతిహసితమునకుదాహరణము. పై వింగడింపుతో హాస్యముననుభవించు పద్ధతి నిర్ణయింపబడిన దే కాని దానిస్వరూపము– ఇదమిత్థమని తేలలేదు.

కుబ్జవామనాదుల బేర్కొనుటలో దానివ్యాపకతాధర్మముగూడ చాలసంకుచితమైనది. ఆలంకారికుడువేసిన – ఆదిశబ్దము తక్కిన వానిని క్రోడీకరించునని కొందఱనవచ్చును. నిజమే. కానియాతనిదృష్టిమాత్రము వికారస్వరూపులతోఁగలుగు చౌకహాస్యమునందే నిబద్ధమైనదని–అతనికి వారిపైనున్నపక్షపాతమే చెప్పుచున్నది. లేకున్నచో వారినే పేరు

దీసి చెప్పవలసిన పని యేమున్నది? శాకుంతలమునందలి యీ క్రిందిసంభాషణమును గమనింపుడు. అనసూయా ప్రియంవదలతోఁగూడికొని శకుంతల యుద్యాన వనములోని లతలకు నీరుపోయుచున్నది. ఆమెకు స్తనకంచుకము బిగువైనది. కొంచెము వదలుసేయుమని శకుంతల చెలికత్తెను ప్రార్థించినది. ప్రియంవద ''మేమేమిసేయుదుము. క్షణక్షణమునకె దిగివచ్చుచున్న నీ యౌవనము నడుగు''మన్నది.

శ॥ సఖి! అదయ పినద్ధేన వల్కలేనప్రియంవదయాదృఢం
నియంత్రి తాస్మి శిథిలయ తావదేతత్

అ॥ తథా

ప్రి॥ అత్ర తావత్పయోధర విస్తారయితృ
ఆత్మనోయౌవన ముపాలభస్వ

ఈసంభాషణలో గొంతశృంగారస్ఫూర్తియున్నను హాస్యముస్పష్టముగ గనుపించుచునేయున్నది. మఱివిశ్వనాథునినిర్ణయము ప్రకారమిందులో నసత్ప్రలాపముండవలెను. శకుంతల యభ్యర్థనలోగాని-యనసూయ సమాధానములోగాని యసత్ప్రలాపమున్నదని యెవ్వరనగలరు? విశ్వనాథుడుగూడ ననఁజాలడనియే నానమ్మకము. అనసూయ యొసగిన ప్రత్యుత్తరమును 'సరస'మనియో 'సల్లాప'మనియో చెప్పవచ్చును. వీనినే దిక్కనచతురోక్తులనిపలికెను. ఆతడీచతురోక్తులలోఁజాలగట్టివాడు. సైరంధ్రి కీచకునకు సంకేతమును దెలిపి భీమునిదగ్గఱకు వచ్చెను. అప్పుడామె వికసిల్లెడు నాననపద్మముతో నిట్లన్నది.

క. నాకొంత దీర్చివచ్చితి
నీకొంతయు యింకసూతునిక్ దెగఁజూడక్
లోకము వంచింపను దగు
చీకటి రేయొదవ నేను సేసెదొ చెప్పుమా?

ఈయుక్తివైచిత్రి-సోమయాజుల భారతమున నడుగడుగునను వచ్చుచుండును. చేష్టలతో హాస్యమును సృష్టించు పద్ధతి గూడ నాతనిలో నక్కడక్కడనున్నది. కాని యాపద్ధతిపై సోమయాజులకాదరముదక్కువయే మోయనిపించును.

లాక్షణికుల మాటయెట్లున్నను - మనపూర్వ కవులందరును హాస్యమును యథోచితముగ నారాధించినవారే. సంస్కృతనాటకములన్నింటిలో విదూషకుడు విధాయకముగ నుండవలసినదే. మాళవికాగ్నిమిత్రమందుఁగాళిదాసు గొంత తెలివిగల విదూషకునినే తయారు చేసినాడు. తరువాత నాతని విదూషకుడును నలుగురితోపాటి వాడైనాడు. సాధారణముగా సంస్కృతనాటకములలోని విదూషకులందఱును తిండిపోతులే. తమభోజన ప్రియత్వము చేతనే వారు మనలను నవ్వింపఁజూతురు. విదూషకుడు లేని సన్నివేశములలోగూడ నక్కడక్కడ గొంతహాస్యముండును. భవభూతి హాస్యము మహాగంభీరమైనది. ఉత్తరరామచరిత్రమున లక్ష్మణస్వామి సీతాదేవికి - చిత్రపటములు చూపుచున్న వేళము గలదు. ఆ చిత్రములన్నియు నాటికి సీతారామలక్ష్మణులు గడచివచ్చిన గాథలను వర్ణించునట్టివే. సీతాస్వయంవరము

నకు సంబంధించిన ఘట్టమును లక్ష్మణుడు చూపునప్పుడు-జానకియాపటములోని యూర్మిళనుజూపి యీమెయెవరు? అని ప్రశ్నించినది. ఈపరిహాసమునకు బదులువలుకక యేలక్ష్మణస్వామి ముందునకు సాగిపోవును. మృచ్ఛకటికమునందును హాస్యము సమృద్ధిగానున్నది, శకారునిపాత్రము విశ్వనాథుని యసత్ప్రలాప లక్షణమునకు నేరుగా నుదాహరణము. సంస్కృత కవులలో హాస్యమునకు భాసుడు ప్రసిద్ధుడు. 'భాసోహాసః' యని యభియుక్తి. కవులందఱు గలిసి సరస్వతీదేవి యాకారముకాగా నందులో భాసుడా దేవి హాసమైనాడట. భాసునిసాహిత్యమునుగూర్చి యింకను చక్కని విమర్శన మెంతయో జరుగవలసియున్నది. వాల్మీకి రామాయణమునందు-అన్నిరకములైన హాస్యమును వచ్చును. ఒకపట్టు మచ్చునకుఁజూపుదును.

శ్లో॥ మైథిలీతుహరిశ్రేష్ఠాత్ శ్రుత్వావచనమద్భుతం
హర్ష విస్మిత సర్వాంగీ హనుమంత మథాఽబ్రవీత్.
హనుమన్ ! దూరమధ్వానం కథంవావోఢుమిచ్ఛసి
తదేవ ఖలు తేమన్యే కపిత్వంహరి యూథప !

అశోకవనమునందలి సీతాదేవితో ''నిన్ను రామునియొద్దకు మోసికొనిపోయెద''నని హనుమంతుఁడన్నాడు. అప్పటిహనుమంతుడంగుష్ఠమాత్ర శరీరుడు. అతనిమాటలువిని యామెకు నవ్వువచ్చినది. 'నన్ను మోసికొని నీవెట్లు సముద్రమునుదాటగలవు? ఇదినీమర్కటబుద్ధిగదా ! 'యని సీతయన్నది.

ఆయావ్యక్తులచేష్టలను వర్ణించుటతోగూడ మహర్షి వాల్మీకి పాఠకులను నవ్వించుటకద్దు. సీతను వెదకి యామె జాడ గనుగొన్నమీదఁ గోతులన్నియు రామునిచెంత జేరినవి. సీతాదేవివృత్తాంతము నింతకుముందే హనుమంతుఁడు వారికి సవిస్తరముగఁ దెలిపియుండెను. కనుకకోతులన్నియు శ్రీరామునియెదుట నేనొక్కఁడనొక్క విషయముగ - కలగాపులగముగ - జానకీవృత్తాంతమును దెల్పనారంభించినవి. రామునకీ గడబిడలో నేమియునర్థముగాలేదు. కడకాతఁడు "సంగతియేమ"? నిసామూహిక ప్రశ్న వేసినాఁడు. హనుమంతుఁడొక్కఁడే సీతావృత్తాంతకోవిదుఁడు. తక్కినవారికి బదులిచ్చు శక్తియెక్కడిది? అవియన్నియు బిక్కమొగములు పెట్టి-హనుమంతుని బదులుసెప్పుటకై ప్రేరేచినవట.

యువరాజంపురస్కృత్య సుగ్రీవమభి వాద్యచ
ప్రవృత్తి మథసీతాయాః ప్రవక్తుముపచక్రముః
రావణాంత పురేరోధం రాక్షసీభిశ్చతర్జనా
రామేసమనురాగంచ యశ్చాయం సమయఃకృతః
వైదేహీ మక్షతాందృష్ట్వా రామస్తూత్తరమబ్రవీత్
క్వసీతావర్తతే దేవీ కథంచమయి వర్తతే
ఏ తన్మే సర్వమాఖ్యాత ! వైదేహీం ప్రతివానరాః
రామస్యగదితంశ్రుత్వా హరయోరామసన్నిధౌ
-చోదయంతి హనూమంతంసీతావృత్తాంతకోవిదం

ఈ కోతిచేష్ట మనకు నవ్వుగలిగించును. ఆ చేష్ట సహజమే యైనను నా సన్నివేశమున మనకుహాస్యకారణమగుచున్నది. స్వాభావిక చేష్టలుకూడ దేశకాలపాత్రములబట్టి హాస్యకారణములగుట జీవితమునకద్దు. జీవితమువంటి కావ్యరచనయందుమాత్రమేల లేకపోవును? కీచకుడు సైరంధ్రిని కేకయరాజపుత్రిసదనమున జూచినాడు. వానిధృతి పల్లటిల్లినది. కార్యాకార్య విచారముదప్పినది. అప్పుడువాడామెయెదుట నిలిచి తనమనస్సులోని కోర్కెలిట్టు బయలుపెట్టినాడు.

సీ॥ ఎవ్వరితోనైన నెలుగెత్తియొక్కింత
పనిలేని వెంగలి పలుకువలుకు
మట్టియలోండొంటి బిట్టుదాకగ నేల
నందందమునిగాళ్ల నప్పళించు
గడువికారంబుగా నోడలెల్ల విఱుచుచు
మలగి రిత్తకురిత్త చెలగినవ్వు
తాళంబుగాఁగరతలమున బెలుచఁగం
బంబుఁ వేయుచు వెడపాటవాడు
తే. మలయునంతంత జేరువ బొలయునింతి
దన్నుజూడమి కెంతయు దల్లడిల్లు
నిక్కడక్కడవడు దగులినుపడింప
జూచునత్తన్వి బోరిబోరి కీచకుండు.

కీచకుని యీ యవస్థకు మనకువానిపై సానుభూతి కలుగదు. ఈ పద్యమున నావిష్కరింపఁబడినవాని కామ వికార

మంతయు హాస్యమునకే యుదాహరణము. వానినిగూర్చి మనము నవ్వవలెననియే సోమయాజుల యభిప్రాయమును. అందుకేవారు—తదుపస్ఫోరకములైన 'వెడపాట,' 'రిత్తకు రిత్త'యిత్యాది పదములను వాడిరి. పద్యముతరువాత 'దుర్విలాసముల'ని తమసిద్ధాంతమును దేల్చివేసినారు.

నన్నయభట్టులు దమభారత భాగమున హాస్యము నక్కడక్కడ నిబంధించిరి. అర్జునుడు ద్రుపదునిబంధించి తెచ్చినాడు. ద్రోణులకు వానిపై గూఢ ద్వేషమున్నది. అప్పుడు ధనురాచార్యులు ద్రుపదునిట్లుల్లస మాడిరట!

కం॥ వీరెవ్వరయ్య ద్రుపదమ
హారాజులె యిట్లుకృపణులయిపట్టువడఁగ
వీరికివలసెనె యహహా! మ
హారాజ్య మదాంధకారమది వాసెనొకో?

ఈ ఛాయనే యందికొని పోతనామాత్యుడింకను లలితముగ—నిర్బాధముగ—హాస్యమును సృష్టించినాఁడు. కృష్ణుడు వెన్నలు దొంగిలెను. యశోదయాతనిని బట్టుకొన్నది. పట్టుకొని యామె చిన్నికృష్ణునిట్లు హెచ్చరించినదట?

కం॥ వీరెవ్వరు శ్రీకృష్ణులు
గారా! యెన్నడును వెన్నగానరట కదా!
చోరత్వంబించుకయును
నేరరట ధరిత్రి నిట్టి నియతులు గలరే!

ఆంధ్రకవులలో సర్వతోముఖముగ – నాజూకుగ శృంగార హాస్యములనుబోషించినవాడు పోతనామాత్యుడు. భాగవతము పై సమగ్రమైన విమర్శనము లింకనురావలసియున్నవి. నాచన సోముని హాస్యము కొంచెము మోటు. శ్రీనాథుని హాస్యమున మోటు దనమేకాదు దురుసుదనముగూడ నెక్కువ. పెద్దనామాత్యులది మందహాసము. ప్రబంధకవులలో హాస్యరస చక్రవర్తి తెనాలిరామకృష్ణుడే. రామకృష్ణుని తరువాత రాయలు గణ్యుడు. కృష్ణరాయని నగవప్పుడప్పుడు గొంత ముదురుపాకమున గూడనుండును. ఈ పద్యమునుచూడుడు.

సీ॥ సనకాది దివిజమస్కరి ఫాలగోపి చం
దన పుండ్రవల్లికల్ నాకినాకి
సెలసి హాహా హూహూవుల దండియలతంత్రి
ద్రెవ్వ సిగ్గిణులుగాఁదిగిచి తిగిచి
సప్తర్షికృత వియజ్ఝర వాలుకా లింగ
సమితిముచ్చల కాళ్ల జమరిచమరి
రంభాప్రధానాప్సరః పృథూరోజ కుం
భంబు లెచ్చటగన్న పట్టిపట్టి
గీ॥ తిరుగు హరిపుర సురతరు సురలమఱిగి
బహుళహళహళి భరిత కల్బరగినగర
నగరపురవర పరిబృఢ జవనయవన
పృతన భవదసిననిఁదెగికృష్ణరాయ !

కలుబరిగిని కృష్ణరాయడాక్రమించెను. అపుడాతనిచే జంప బడినయవనులు–యుద్ధమునందు జచ్చినవారు గనుక–స్వర్గము

నకుబోళ తప్పినది కాదు. వారొనర్చిన దుశ్చేష్టలు పైపద్యమున వర్ణింపఁబడినవి. అందులో హాస్యమున్నది. కాని యంతకంటె నెక్కువగా నసహ్యముగూడ మనకు గలుగును. హాస్యరసమును బోషించుటలో నద్వితీయుడు మఱియొక్కడున్నాడు. అతడు వేమన్న. అతనిహాస్యమెక్కువగా భావగతమైనది. శబ్దసాహాయ్యముతో సృష్టించు హాస్యము తాత్కాలికముగఁ బనిసేయునే కాని దాని తావి నిత్యనూతనముగ నుండదు. వేమన్న హాస్యమున కా వెలితి లేదు. చూడుఁడు.

పాలసాగరమున బవ్వళించినవాడు
గొల్ల యిండ్ల పాలు గోరనేల ?
యెదుటివారిసొమ్ము లెల్ల వారికిదీపు
విశ్వదాభిరామ వినుర వేమ !

సకలతీర్థములను సకలయజ్ఞంబులఁ
దలలుఁగొఱుగకున్న ఫలములేదు
మంత్రజలముకంటె మంగలి జలమెచ్చు
విశ్వదాభిరామ వినుర వేమ !

శబ్దగతమైనను రామకృష్ణునిలో మఱియొక శక్తియున్నది. అతడు తత్త్వమునే చెప్పుచుండును ఎదుటివారిని నవ్వింపవలెనను దృష్టిగూడ నాతనికుండదు. కాని యాతడు వర్ణించు పద్ధతిలో మనకు నవ్వు గలుగును. ఇట్టిశక్తి కొందఱకుండును.

వారేమి చెప్పినను-ఎదుటివారు పడిపడి నవ్వుదురు. వారికి దెలియకనే యెదుటివారు నవ్వుచుందురు. అట్టివానిలో నీ క్రిందిపద్య మొకటి.

సీ॥ సనకసనందనాది నిఖిలాంతర్వాణి
హృల్లీన భావంబుసల్ల బెట్టి
విశ్వంభరాభోగ వివిధమూర్త్యంతర
స్ఫురితాను భావంబు బుజలువైచి
శింశుమారాకృతి స్వీకృతి వైకుంఠ
పట్టవిహారంబు జాఱవిడచి
క్షీరోదమధ్యస్థలీ రత్ననగ గుహా
గర్భనివాసంబు కచ్చువదలి
గీ॥ పుండరీకేక్షణుండు శిఖండి బర్హ
మండిత శిఖండకుడు నఖాఖండలుండు
పుండరీకుని మానసాంభోజపీఠి
మిండతుమ్మెదయైయుండు నిండుకొలువు
( 2 ఆ. 11 పద్యము )

పుండరీకుడు మహాయోగి. అతడు, ధ్యానావస్థితుడైనపుడు-ఆతనిహృదయ పద్మమున శ్రీకృష్ణుడు ప్రకాశించునని కవి వర్ణించుచున్నాడు. ఇందులోనాతనికి—ఎవరినిగూడ హాస్యము చేయవలెనన్న తలపే లేదు. ఎదుటివారిని నవ్వింపవలెనన్న యూహాయు లేదు. కాని 'సల్ల బెట్టి'—'బుజలువైచి' ఇత్యాది శబ్దములతో మనము నవ్వెదము. 'ఇట్టిచిత్రపద

ప్రయోగములు వీడెక్కడ నేర్చెన'ని మనకు నవ్వు. ఇట్టివి నోదములు రామకృష్ణునకు జన్మసిద్ధమైన వాసన. హాస్యమును బోషించుటకే సంస్కృతమున గొందఱు రచనలొనర్చిరి. వారు ప్రహసనకారులు. కాని మనదురదృష్టముకొలది సంస్కృతములోనున్న ప్రహసనము లన్నియు నించుమించు హాస్యముపేరిట నసహ్యాభావమునే రేకెత్తించు చున్నవి. పశుప్రాయులైన కులటలు జారులు వీనిలో నాయికానాయకులు. వారి కామ వికారములే హాస్యరససాధనములు. అంతకంటె హాస్యరసమును బోషించుమార్గములు — ఆకవుల యూహాలకందనేలేదేమో! తెనుగులోఁగూడ నట్టివి గొన్ని యున్నవి. చంద్రరేఖావిలాపమాకోవలోనిదే. ఆకవి మొదలు చంద్రరేఖావిలాసమును వ్రాసెను. ఇంతలోఁ బాళెగాడు ధనము నెగురగొట్టినాఁడు. కవికి 'విలాపము' బయలుదేరినది. ఆకవిచిత్తవృత్తినలెనేయున్నది వానికవితావ్యాపారముగూడ. కవి చౌడప్పతిట్లతో నెదుటివారిని నవ్వింపఁజూచును. క్రీడాభిరామమునందునుఁ గొంతహాస్యమున్నది. కాని యది శబ్దగతము. కృతకమును. శతకములలో చంద్రశేఖర శతకముహాస్యమును బోషించినది. గ్రామ్యభాషాప్రయోగముచేనా కవిత్వమున హాస్యము స్ఫురించును. సమకాలికులైన పాళెగాండ్రు, వారి దుర్వ్యాపారములు-రసికత పేరిట యరసికత—మొదలగు విషయముల నీకవి గేలిసేసెను. ఆతని పద్యము లిట్టివి.

ఉ॥ సంగీతకాడపాడకిక సాలిసు నీవది పాడినందుకున్
ఇంగితమెంచి నేనుమఱియున్నదుకున్ సరిపోయెనింటివా!
హంగున నేతలూసినటియప్పుకు తంబుర యీడ పెట్టిపో
బంగరుబాపనాడ! యనిపల్కెను మూర్ఖుడు చంద్రశేఖరా!

'ఆంధ్రనాయక శతకము' గూడ చక్కని హాస్యమును పోషించి నదే. దీనిలో నిందాస్తుతివలన హాస్యము సృష్టింపఁబడినది. ఆధునిక సాహిత్యమున హాస్యమును బాగుగ బోషించిన వారు గొందరున్నారు. వారిలో వీరేశలింగము గారొకరు. కాని సంఘసంస్కారదృష్టిప్రబలి వారిహాస్యము కొంతమొదు రైనది. ఎదుటివారిని తప్పులుబట్టుటయే హాస్యముకాదు. గిచ్చినను—నొప్పిగలుగకుండునట్లు గిల్లవలెను. నవీనులైన హాస్యరచయితలలో గురజాడ యద్వితీయుడు. అచ్చమైన హాస్యరచనకు దారిజూపిన గౌరవమాయనకు దక్కినది. అతని గిరీశమువంటిపాత్ర నేనెఱిగినంతవఱకు మఱియేభాష యందును లేదు. కాని యాతని దురదృష్టము—అతడు తెలుగు వాడగుట.

పాశ్చాత్య లాక్షణికులుగూడ హాస్యమునకు గొన్ని నిర్వచనము లొసగిరి. ఎదుటివారిమనస్సు నొవ్వనట్లు వారి లోనిదౌర్బల్యమునో—లేక యాంగిక వికారమునో యెత్తిచూపుట హాస్యమునకుకారణమని—అరిస్టాటిల్ మహాశయుడన్నాడు. The ludi-crous is a subdivision of the ugly resting on some defect or ugliness, which is not painful

or destructive (Aristotle on Poetics) ఒక. విషయము జరుగబోవునని మనము తదేక బుద్ధితో నెదురుచూచునప్పుడు— ఆశాభంగమగుట హాస్యము నుద్దీపింపజేయునని Kant వాక్యము. Humour is sudden transformation of a tense expectation into nothing (Kant). మనలోని గొప్పతనమో లేక సామర్థ్యమో–హఠాత్తుగ ప్రతిభాసించునపుడు కలుగు విజయ గర్వము నగవునకు మూలమని THOMAS HOBBES వాదము. The passion of laughter is nothing else but sudden glory arising from sudden conception of some eminence in ourselves by comparison with the inferiority of others or our own formally (Thomas Hobbes). ఇంకను నెందరో— ఎన్నిరీతులనో బలికిరి. కాని ఇవియన్నియు యథాప్రకారము పాక్షికములే.

ఆంగ్లమున హాస్యమును Humourఅందురు. ఈశబ్దమునకు గ్రీకుభాషలో 'తేమ'యనిఅర్థము. Humour in origin means 'wetness' and is of the same source as humidity; గ్రీకు శాస్త్రవేత్తలు ఇట్లుభావించినారు. "శరీరమందు నాలుగు తత్వములున్నవి. వీని లోని మార్పులే బుద్ధియందలి పరివర్తనములకు కారణములు. ఈనాలుగును సరిగానున్నపుడే – ఉత్సాహియైన పురుషుడవ్వును." Phlegm, Blood, Choler, Black-bile the four humours in man (Greek Medicine). పాశ్చాత్యుల యభిప్రాయమునుబట్టి శబ్దవైచిత్రిచే కలుగు హాస్య

మధమము. రామకృష్ణుడు వాడిన సామెతలు నూత్నపద కల్పనములు మొదలగువానిచే కలుగు హాస్యమీ కోవకు చెందినదే. అందునను శ్లేషచేకలుగు హాస్యము ఇంకను చౌకరకమునకు చెందినది. భావవైచిత్రిచే కలుగు నగవు ఈ రెంటికన్నను కొంత మెరుగు. తరువాతిది సన్నివేశవైచిత్రి-వైయక్తిక స్వభావవైచిత్రి-వీనితో కలుగు హాస్యము. నాల్గవది మానవజాతిని పరిహసించుట. అనగా సర్వమానవ కోటిలోని యహంకార మమకారములను - కామక్రోధాదులను-ఎత్తిచూపి నవ్వించును. ఇది యుత్తమోత్తమ మైన హాస్యము.

శ్లేషగతహాస్యమంత మంచిదిగాదంటిని. మనప్రబంధములలో నెక్కువగా గనిపించునదిట్టి హాస్యమే.

అనేకార్థములుగల పదములు సంస్కృతములోనున్నన్ని మఱియేభాషలోను లేవు. అందువలననే భారతదేశసాహిత్యములో శ్లేష తఱచుగా గన్పించు చుండును. సంస్కృత కవులు శ్లేషలో మహాఘటకులు ఒకడిట్లనును:-

శ్లో॥ సదావక్రస్సదా క్రూరః సదాపూజామపేక్షతే
కన్యారాశిస్థితో నిత్యం జామాతాదశమో గ్రహః ॥

శ్లేషగత హాస్యమునకుదాహరణముగా మనుచరిత్రలోని యీ పద్యమును చూడుడు.

అపరిమితానురాగసుమనోలసమై చిగురాకుచేతులన్
దపసిని గౌగిలించె వనితా!యిదెరంభ దలంప,రంభ దా
నపరిమితానురాగ సుమనోలసమై చిగురాకు చేతులన్
దపసిని గౌగిలించుటుచితంబెకదా! యన నవ్వెరంభయున్

ఈపద్యమున దపసియనగా నవిసిచెట్టనియు, దపస్వియనియు రెండర్థములు. రంభయనగా నరటిచెట్టనియు దేవలోకములోని యొకయప్సరసయనియు నర్థములు. అల్లెలనురాగశబ్దమునకును సుమనశ్శబ్దమునకును రెండేసియర్థములున్నవి. భాషలోనే యిన్ని సౌకర్యములుండగా 'చిగురాకుచేతులన్' అనియొకసమాసమునుగూడఁగల్పించికొన్నాఁడుకవి. ఈసమాసమునకును చిగురాకులను చేతులనియు చిగురాకులవంటి చేతులనియు రెండు రీతుల విగ్రహమున్నది. ఈ హాస్యమెంతకృతకముగానున్నదో తెలియుచునే యున్నదికదా! అందువలననే శ్లేషకృతహాస్య మధమాధమమన్నారు పాశ్చాత్యులు.

శబ్దగతహాస్యములోనే శ్లేషకంటెకొంత మెఱుగైనది మఱియొకటున్నది. దానినిమనపూర్వలాక్షణికులుగుర్తింపనేలేదు. వారుగుర్తింపలేదుకావునమనభాషలో దానికిపేరేలేదు. దానినాంగ్లమున Parody యందురు. ఈ శతాబ్దములో నొకరిద్దఱు తెలుఁగుకవులు Parody లు-అవియు కావ్యాచిత్యముగ -వ్రాసినారు, కానిమనపూర్వ సంస్కృతాంధ్రసాహిత్యమంతటిలోను నాకుఁదెలిసినంతవఱకొకేయొక Parody యున్నది. అదియును హాస్యచక్రవర్తియైన మన తెన్నాలిరామలింగనిదే. గర్వపర్వత మస్తకస్థితుడైన యొకకవి రాయలయాస్థానమునకు వచ్చి తాను రచించినయొక దుర్భేద్యమైన పద్యమునకర్థము చెప్పుఁడని యాస్థానములోని కవిపండితుల నందఱను సవాలు చేసినాఁడట! ఆపద్యమిది.

సీ॥ రాజనందనరాజ రాజాత్మజులు సాటి
తలపనన్నయవేమ ధరణిపతికి
( ఇట్లే నాలుగు పాదములు )

గీ॥ భావభవభోగ సత్కళాభావములను
( ఇట్లే నాలుగు పాదములు )

ఆపద్యమును విన్నపండితుల మొగములు తెల్లవో యిననట ! అపుడు మనరామలింగడు లేచి

సీ॥ మేకతోకకు మేకతోక మేకకు తోక
మేకతోకకు తోక తోకమేక
( ఇట్లే నాలుగు పాదములు )

గీ॥ మేక తోకతోక మెకమేక మేకతోక
( ఇట్లే నాలుగు పాదములు )

అని గ్రుక్కద్రిప్పకుండ నేకధారగా పద్యమునుజెప్పి యిక గానిమ్మన్నాడట ! ఇది Parody యను హాస్యభేదమున కొక యుదాహరణము. మొదటిపద్యమున నుకరించుచు దానినే పరిహసించుచున్నది రెండవపద్యము. ఈపద్యమును రామలింగఁ డెవ్వరినిగాని నవ్వించుటకు జెప్పలేదు. ఎదుటివానిని హడలు గొట్టుటకే చెప్పినాడు. అనఃగా నానా డదిParody గాదు. కాని మనమీనాడు దానిని Parody గనే స్వీకరించి యానందించుచున్నాము.

ఈ Parody లో మొదటి పద్యములోని శైలిని మాత్రమే రెండవ పద్యమనుకరించుచున్నది. భావమునుగాని లేక శైలిభావము రెంటినిగాని యనుసరించి పరిహసించు Parody కొంత యుదాత్తమైనది. పట్టుబట్టినచో నటువంటి Parody కిని మన పూర్వకవులనుండి యుదాహరణము లీయవచ్చునేమో ! ఏ పిల్లినో యెలుకపిల్లనో పట్టుకొని యొక పెద్ద సీసపద్యములో దీర్ఘ దీర్ఘ సమాసములతో 'మార్జాలచక్రవర్తి' యనియో 'మూషకరాజ్య మూర్ధాభిషిక్త' మనియో చెప్పినపద్యములు మనప్రబంధములలో లేకపోలేదు. ఆపద్యములు ప్రబంధ కవితా పద్ధతినే పరిహసించు Parody లనవచ్చును. కాని హాస్యోద్దేశ్యమే మాత్రమును లేక యామార్జాలము యొక్క చక్రవర్తిత్వముమీద ఆమూషికముయొక్క మూర్ధాభిషిక్తతమీద నచంచల విశ్వాసమున్న ఆయాకవులు మనహాస్యసృష్టిని కుసంస్కారమని యీసడింతురేమోయని నాభయము.

శ్లేషగతమైన హాస్యమును తెనాలి రామలింగడు పాండురంగమాహాత్మ్యములో నీ పద్యమువలన సాధించినాడు.

చ॥ విమల మయూఖరేఖయు నవీనతరోత్పల పత్రముఁ బ్రవా
ళమణియు నొక్కతీవయబలాప్రతి దాల్చెనటన్న వించు వి
భ్రమశిధిలాంగియయ్యె కుచభార నితంబ కపోలగోపన
క్రమకలనాకులాత్మయయి కన్నుల నీళునదల్చెగౌరియుఁ

( 1 ఆ. 186 ప )

విమల మయూఖరేఖ, ఉత్పలము, ప్రవాళమునను పదములకు సామాన్యార్థములే గాక కుచముల యందును, నితంబములయందును, కపోలములయందును నుంచబడు నఖక్షతములకును నర్థములు వరుసగానున్నవి. ఇట్లు రెండర్థములుగల పదముల సహాయముతో నీశ్వరుడు పార్వతితో సరసములాడుచున్నాడు. ఎందుకాడడు? ఏకాంతముగ గాంతామణి దొరకినపుడు!

శ్లేషసహాయములేక – శబ్దవైచిత్రితో కల్పింపబడిన హాస్యముగూడ పాండురంగ మాహాత్మ్యమున కొల్లగానున్నది. అట్టిపట్టులుకొన్ని పరిశీలింతము. శివుడు కృష్ణుని మనసులోఁదలచుచున్నాడట! ఆకృష్ణునకు వెడదలగుకన్నులున్నవి. వేయినామములున్నవి. ప్రేతల వలపించు నెరవులున్నవి. మంచి పింఛెమును జెరివినాడు. సరేయన్నియు బాగుగనేయున్నవి. ఇన్నియున్నను పాపమా వన్నెకానికి దిస్సమొలయేనట! పైగా రామలింగ డాతనికి జిప్పకూకటి నొకదానిని దెచ్చిపెట్టినాడు. ఆనామముల గొల్లవానిచిప్పకూకటిజూచి మనకు నవ్వు రాకుండునా! పాపము! జటాజూటము శివునకెంతబరువుగా దోచినదో.–చిన్నికృష్ణుని చిప్పకూకటిని దలచికొని మురిసినాడు. అంతేకాదు. ఏనుగుతోలు గఱుకుతో నొడలంతయు వాచియున్న పరమేశ్వరునకు దిస్సమొలలోని సౌకర్యము గోచరించియుండవచ్చును. లేకున్న కృష్ణుని దిస్స మొలను దడవిచూచుపని శివునకేమున్నది?

రామకృష్ణుడిట్లే యెంతటివారినైనను విడువక తమాషాలు సేయుచుండును.

కాశీనగరమును వర్ణించుచు దానివిస్తార మహిమకు దగినట్లే వెడురుగడలవంటి విశేషణములు దగిలించినాడు. శ్రీతాఘార్యసుతాళిసేవిక చరాజీవము – విశ్వేశ్వరజ్యోతిర్లింగ విశుద్ధరత్నఖని–మోక్షోపాయదుగ్ధాబ్ధి వేలాత్రీరావని–అనిగంభీరముగ బొగడినాడు. వెంటనే 'డుంఠినామకగజాలానం'బని కాశికాపురియొక్క పరువునొకగుంతలో ద్రోసినాడు. డుంఠి అను పేరుతో కాశిలోనున్న వినాయకు డొక యేనుగట! కాశీనగరమా యేనుగును గదలకుండ గట్టివైచిన గుంజయట! పాపము! కాశికాపురిమాహాత్మ్యమంతయు నొక్క మాటతో గంగపాలైనది. ఒక్క వ్రేటుతో గజాననుని బింకమంతయు గుంజపాలైనది. ఇట్టి వానిని మన లాక్షణికులు నీచోపమ లన్నారు. ఒకవ్యక్తినిగాని వస్తువునుగాని గొప్పగా జెప్పినపుడు. ఉత్తములతోనో ఉత్తమవస్తువులతోనో పోల్పక నీచులతోనో నీచవస్తువులతోనో పోల్చుట నీచోపమ. కాని మన రామకృష్ణునకు మేలుకీడుల యంతరమును గమనించు నోపికయున్నట్లులేదు. ఎవరినైనను దేనితోనైననుబోల్చును.

హాస్యకారణ విభాగములలో శబ్దవైచిత్రికంటె గొంతయుత్తమమైనది భావవైచిత్రియంటిని. నీచోపమ యనునది న్యాయముగ శబ్దవైచిత్రిలోనిదిగాదు ; భావవైచిత్రికి జెందినది. డుంఠినామక గజాలానమనుచోట గజాననుని గజముతో బోల్చుటలో గొంత స్వారస్యమున్న

దన వచ్చును. కావుననది సంపూర్ణముగ నీచోపమ గాదేమో! కాకున్న నేమాయె? దానితాతవంటివి లెక్క లేనన్ని కలవు. శ్రీకృష్ణుడు దేవకీతర్ణకమట! శ్రీకృష్ణు నంతటివానిని బట్టుకొని దూడయను సాహసము వికటకవి యగు రామలింగనికిదక్క మఱియొకని కెట్లుండును? శ్రీకృ ష్ణునియెడ దనకున్న చనవుకొలది రామలింగ డాతని దూడ లలోగలిపి తోలుట సబబేయని సమర్థించుకొన్నను - పాప మాతల్లి దేవకీదేవి పాపైనను గొంతగ మనింపవలసియుం డెను. విట్ఠలయ్య—'ఎన్నికల్పంబులరిగిన యేనయేండ్ల వెలయు బ్రాయంబుగల కొయ్య' యట! పనిగట్టుకొని వెదకిన-చోనిట్టి మాటలకు బాండురంగమాహాత్మ్యమున గొదువయే లేదు. సూర్యుని గమనము నడ్డగించు వింధ్యభూధరము పొంకము బింకముదక్కి భయముగొన్న యెండ్రివలె నేలలోనణగిన దట. ఈనీచోపమతో నవ్వుగాకయింకేమిగలుగును?

నీచోపమవలెనే యతిశయోక్తి గూడ నొక్కొక్క ప్పుడు హాస్యమును గలిగించును. పాండురంగ మాహాత్మ్య ములోగాకి కథయొకటున్నది. ఆకథయంతయుఁ గవి నాల్గు పద్యములలో జెప్పినాడు. అందులో మొదటి రెండుపద్యము లును నాకాకకులావతంసుని గొప్పతనము సెప్పుటకే సరిపో యినవి. యమరాడ్దూతశిఖావతంసమని యారంభించినాడు. యమరాజు దూతలలో నగ్రతాంబూలము కాకమునకిచ్చి గౌరవించినాడు. యమరాజ పరివారమున కింతకంటె నవ మానమేమున్నది! యమునిదూతలన్న రామలింగని కంత చులకన. ఆకాకినంతటితోనైన విడిచిపెట్టినాఁడా!

''అదియొకనాడు విట్ఠల గృహాంగణభూబలి పీఠవర్తులా
మెదుకులు మేయ గన్నిడి యమేయగతిన్ బరవందదాయత
చ్ఛదభవభూరి మారుత వశంబున నయ్యెడధూళి''

పోయినదట! మెతుకులు మేయుటకు కాకియ మేయ గతితో వచ్చినదట! అప్పుడు భూరిమారుతము రేగినదట! ఎంతగొప్పలు సెప్పినను కాకి కాకి గాక గండభేరుండమగునా? ఈయతిశయోక్తులతో నాకు హాస్యముదప్ప మరేమియు స్ఫురించుట లేదు.

నీచోపమవంటిదే మఱియొకరకమైన హాస్యమున్నది. నీచార్థమునమాత్రమే వాడుకలోనున్న పదములను రామలింగడుదాత్తమైనయర్థమున వాడును. అట్టిహాస్యసందర్భములు రెండుపరికింపుడు. పుండరీకుడను మునీంద్రుని భక్తికి మెచ్చి శ్రీమహావిష్ణువు ప్రత్యక్షమైనాడు. తనతపస్సుల పంట రూపుగట్టి యెదుటనిలిచినప్పుడే భక్తుడు దన కర్తవ్యమును మఱచును? పరిపరివిధముల పొగడ్తలతో దనపాండిత్యమును వెల్లడించికొనవలెనుగదా! పుండరీకుడు మొదలు పెట్టినాడు.

''పొదలు నీపొక్కిటిపువ్వు కాన్పునగదా!
పెనుమాయపిల్లలు బెట్టుకెల్ల''

అని యింకను నేమేమో 'సర్టిఫికెట్టులు' 'జారీ' చేసినాడు. ఆదామోదరుడా యిచ్చకముల కుబ్బితబ్బిబ్బై కోరినవరము

లిచ్చినాడట ! అద్వైతవేదాంతములో మాయ యనునదొక మహానిగూఢమైనశక్తి. మహామేధావులైన వేదాంతు లెందఱో దానిని వివరించుటకు నానాబాధలు పడినారు. అట్టి మాయచే మనరామలింగడు పిల్లల బెట్టించుచున్నాడు. పిల్లలుబెట్టుట యనుపదము మనము సాధారణముగా జంతువులయందే వాడుదుము. కాని రామలింగనికది యొక హాస్యసాధనమైనది. ఇట్టిదేమఱియొకటి. నారదుడాకాశమునుండి భూమికిదిగి వచ్చుచున్నదృశ్యమును వర్ణించు ఘట్టమిది. "నిగిడి సుషుమ్న ఈనిన పిల్ల వెలుగుల వడువున నెఱసంజడలు నిక్క" నాజడదారి దిగివచ్చుచున్నాడట ! సుషుమ్న యనునదొక నాడీవిశేషము. సుషుమ్నానాడి పిల్ల వెలుగుల నీనినదట ! నారదునిజడలాపిల్ల వెలుగులవలె నెఱ్ఱగానున్నవట! ఈనుట యనుపదమునుగూడ పశువుల విషయముననే మనముపయోగింతుము. గౌణవృత్తిలో - నిట్టిమాటలు_సొబగు గూర్చునవేయైనను-నీ-చోట నాప్రయోగము రామలింగని హాస్యప్రవృత్తికి దోహదమొసఁగుచున్నది.

నిగమశర్మకుగాపుకోడలిపైఁగన్ను వడినది. అది గూడ దనపై మరులుగొని యున్నదని యాధూర్తుఁడు గమనించినాడు. వాఁడు.

మ॥ "భళిరా తేరకు తేరదక్కె నిటులీబంగారు కుండంచుజం
కలుదాటించుచుకెంపుమోవి దొడుకంగా గుబ్బపాలిండ్లుబి
ట్టలమంగా ముఖగంధపారణము సేయంగా,"

మోరసాచి లొట్టలువేసిగాడు. ఆ'వనితామానస సూన సాయకు'ని కాయికప్రవృత్తి-కామవిషయమున నెన్నాళ్లో గనో కట్టువడియుండినది. ఆయుపవాసమునకు పారణము సేకూరినది. పారణశబ్దము నీసమాసమున నదుకుటలో రామకృష్ణుని హాస్యదృష్టి మనకుస్పష్టముగా దెలియుచున్నది. దొంకంగా, బిట్టలమంగా నను నూతపదములలోగూడ గంపెడు హాస్యమున్నది.

భావవైచిత్రిలో మఱియొక విభాగము వ్యాజనింద యనునది. దీనినాంగ్లమున Irony అందురు. ఒకవ్యక్తి మఱొకవ్యక్తిని బాగడునట్లు నటించుచు నిందించినచో-అనగా బాహ్యార్థమున స్తుతియు నంతరార్థమున నిందయు నున్నచో-నది వ్యాజనింద యనబడును. వ్యాజస్తుతియు నిట్టిదే. అందు వాచ్యమున నింద, వ్యంగ్యమున స్తుతియుం డును. వ్యాజస్తుతివలన సామాన్యముగ హాస్యము గలు గదు. కాని వ్యాజనిందలో కొంతహాస్యముండును. పాండు రంగమాహాత్మ్యమున శివుడు పార్వతీదేవికిఁ బౌండరీకక్షేత్ర మాహాత్మ్యమును వినరించుచుభక్తు లాక్షేత్రములో నేమేమి సేయవలసినది చెప్పుచున్నాడు.

చేడియ! తీర్థమూర్తికడ సేయదగుఁ మనుజుండు సేచనా
క్రీడనముల్ మహీదివిజకేసరులకఁ బరమాన్నశర్క రా
పాడబ గోఘృతేక్షు రసశాకములకఁ ఫలపానకాదులన్
వీడెములన్ బ్రమోదపడివీమదలిప్ప జెలంగజేయుచున్

'మహీదివిజకేసరుల'నగా బ్రాహ్మణోత్తములు. బ్రాహ్మణులకు సంతోషముచేగలుగు మత్తునందు కోరికనువృద్ధి నొందింపవలెనట! ఆసంతోషమెట్లుగలుగుననగా పరమాన్నము -శర్కర-పాడబము-గోఘృతము-ఇక్షురసము-శాకములు-ఇంకను ఫలపానకాదులు పైగాపీడెములు - వీనితో గలుగును. ఇక్కడ బ్రాహ్మణులను 'మహీదివిజకేసరుల'ని పొగడుచునే రామలింగడు వారిభోజనప్రియత్వమునకు వేషమునకు నవ్వుచున్నాడు.

విప్రులభోజనప్రియత్వము నేడంతలేదుగాని - పూర్వకాలమున చరిత్ర ప్రసిద్ధమైనదే-చూడుడు ఒకబ్రాహ్మణునకు గోపమువచ్చినదట! అప్పుడు-

శ్లో॥ భ్రుకుటీ కుటిల లలాటః
కంటకితాంగః కటాక్ష వికటాక్షః
కవలయతి పృథుల కవలైః
తండులమచలం ద్విజః క్రుద్ధః॥

శ్రీనాథకవి రామయమంత్రి భోజన పరాక్రమము నిట్లు వర్ణించినాడు.

ఉ॥ గ్రామముచేతనుండి పరికల్పిత ధాన్యములింట నుండి శ్రీ
రామకటాక్షవీక్షణపరంపరచే గడతేఱెగాక మా
రామయమంత్రి భోజన పరాక్రమమేమని చెప్పవచ్చు నా
స్వామియెఱుంగుఁదక్క-బళిచాతురితాళఫలప్రమాణముల్

పై రీతిగా బాపల భోజన పరాక్రమముతో నంతో యింతో పరిచయమున్న మనకు రామలింగని మాటలతో నెట్లు నవ్వురాకుండును.?

ఎవరైన నొకయాక్షేపము సేయుదురేమో యని నాకు భయమగుచున్నది. రామలింగనికి 'వికటకవి' యను పేరున్నంతమాత్రమున నాతని కావ్యములలో హాస్యములేని పట్టులగూడ నున్నదని చూపించు వెఱ్ఱిమొఱ్ఱిప్రయత్నము లీ పెద్దమనుష్యుఁడు చేయుచున్నాడని యందురేమో! అది రామలింగని వ్యక్తిత్వ మహత్త్వమును గుర్తింపని వారు మాత్రమే సేయుపని. రామలింగడు మహాప్రతిభాశాలియని ముందే మనవి చేసినాను. అంతటి సూక్ష్మ పరిశీలనా దృష్టియు-నంతటి విపరీత విమర్శనాశక్తియు నాకాలములోనే యరుదు. అందఱకు సాధారణముగ గన్పడు దృశ్యమునందే రామలింగని కేదో యసాధారణత్వము గోచరించును. దిన దినము గనపడు నతిసహజ సంఘటనలలో నేదో యసహజ త్వము నాతడు చూచును. దానినికొంతమర్మముగా-గొంత గూఢముగా రామకృష్ణుడు దన కావ్యములలో జూపును. ఆవిమర్శనమేదో బహిరంగముగా స్పష్టముగా నెందుకు జెప్ప రాదందురేమో! ఆనాటిసాంఘిక ధర్మములట్టివి. ఆనాటి మత నిబంధనలట్టివి. సంఘములో గన్పడిన దురాచారము లను-అత్యాచారములను విమర్శించుటకు .మనకీనాడున్నంత స్వేచ్ఛ యానాటివారికి లేదు గదా! అసలీనాడుమాత్రము మనకెంత స్వేచ్ఛయున్నది.! మనకనులయెదుటనేస్వైర విహా

రము సేయుచున్న కూట నీతిని కపటవర్తనమును మనమెంత మాత్రము ప్రేలెత్తి చూపగలుగుచున్నాము.? కృష్ణదేవ రాయలకాలములో కవులకున్నంతమాత్రము స్వేచ్ఛకూడ రామలింగని కాలములో లేదు. అందువలన రామలింగని సాంఘికవిమర్శలు చతురోక్తులుగనో వ్యాజనిందలుగనో రూపొందును. అందుకే యాతడు-భోజనానందముచే బ్రాహ్మణులకు మత్తెక్క-ననుట-అట్టిబ్రాహ్మణులు మహీదివిజ కేసరులనుట.

అట్టిదే వ్యాజనింద మఱియొకటున్నది. పాండురంగ మాహాత్మ్యము విరూరి వేదాద్రిమంత్రికంకిత మీయబడినది. ఈ వేదాద్రిమంత్రి పెదసింగభూపాలునియొద్దమంత్రి. పాండురంగమాహాత్మ్య పీఠికలో రామలింగడా భూపాలునేమని వర్ణించుచున్నాడో చూడుడు. ఆరాజు "పరనారీ సహోదరుడయ్యును నితరసముపార్జిత వధూవల్లభుడ"ట! ఇతరులు ఆర్జించిన వధువులకు వల్లభుడని దీనియర్థము. శత్రువులార్జించిన ధనలక్ష్మికి - రాజ్యలక్ష్మికి-వల్లభుడని బాహ్యార్థమున నెంతపొగడ్తయున్నను నందులో గర్భితముగ నిందయున్నది. ఆనాటి చిల్లర రాజుల ప్రవర్తన కేవలధర్మైకబద్ధము గాదుగదా! పరనారీసహోదరుల మనియెంతబిరుదులు తగిలించికొన్నను, పెఱవనితలపొందుకొఱకు తమ ప్రయత్నములను విరమించుకొన్నవారుగారు.

ఈవిధముగా బ్రాహ్మణులను, రాజులను, విమర్శించు నంతటి విశాలసాంఘికదృష్టి రామలింగని కున్నదాయను

సందేహవాదులకు మఱికొన్ని యుదాహరణములు చూపవచ్చును. సముద్రమును వర్ణించుచు "పేదవడిన పుడమి వేలుపుంబోలె బలివాకిట నడంగి"నదనుచున్నాడు. బలవంతుల ద్వారములయొద్ద దరిద్రబ్రాహ్మణులణఁగియుందురట ! ఇదియానాటి బలవంతుల దౌష్ట్యముమీద నొక విమర్శన మాత్రమేగాదు. ఆనాటిబ్రాహ్మణులమీదగూడనొకవిసరు. ఆశ్లేభోగులను ఎఱ్ఱచీమలతోఁ బోల్చుటలోగూడ నొంత వ్యంగ్యమున్నదనియే నాయూహ !

శబ్దవైచిత్రితోను భావవైచిత్రితోను గల్గించు హాస్యముగాక-పాత్రముల గుణములలోని వైచిత్రితోను-వారిప్రవర్తనలోని వైచిత్రితోను సృష్టించు హాస్యము-స్పష్టముగానుండును. కావున మనల నది సులభముగ నాకర్షించును. ఇట్టిహాస్యమునుగూడ రామలింగడు మనకందించినాడు. ఇతరులు నవ్వవలెనని వర్తించుట భాషించుట మొదలైనవి "Farce." ఇట్టివానిని, "Artificial comedy" అందురు. సుప్రసిద్ధ రచయిత ఆస్కార్ వైల్డు వ్రాసిన " Importance of being earnest " అనుదానిలో నట్టి హాస్యముగలదు. తెనుగులో విరాటపర్వమున నట్టిది హాస్యమును చూడవచ్చును. ఉత్తరుడు మైమఱువుదెప్పించి తొడుగుమని బృహన్నలకొప్పించినాడు. అతడు దాని 'నొడువలు'గా గప్పికొని యచ్చటి వారిని నవ్వించినాడట !

క॥ తెప్పించి తొడుగుమీన ని
యొప్పించిన నిట్టునట్టులొ యవలు గాపై
గప్పికొని యాబృహన్నల
యప్పుడునగుపించెనచటి యబలాజనమున్
( విరా. 4—39 )

పాండురంగ మాహాత్మ్యమున సుశీలయను సాధ్వికథ గలదు. ఆమెకు పరమలోభియైనభర్త దాపురించినాడు. వానిప్రవర్తన మెట్లున్నదో చూడుడు. వాడు భార్యకుదినుటకుముక్క-ధాన్యము లేయిచ్చును. అవియైన 'జాలినన్ని యిచ్చునా? "కొన్ని గొణింగి కొన్నినిసి కొన్ని తుటూరములాడి నూచరా కెన్నిక నిన్నినాళ్ళ కివియి"న్నని కొలిచియిచ్చునట! ఆ కొలతగూడ నికరముగ నుండదు. ఈ వర్ణనము మనల దప్పక నవ్వించును. ఇచ్చట హాస్య మేలగలుగుచున్నది? లోభివాని ప్రవర్తనవలన — అనగా ప్రవర్తనా వైచిత్రివలన. ఆ లోభివాని గుణ సౌర భము లింకను నెట్టున్నవో చూడుడు.

సీ॥ ప్రస్తుతంబని పదార్థములు రాజులవేడి
కొని తెచ్చి యమ్మించు కోమటిండ్ల
మాసిముల్లడచి గుమ్ములకొల్చు పైమెత్తు
లూడ్చేడు పస్తైన నుండుఁగాని
యెట్టి చుట్టంబేని నింటికే తేర రెం
డవ సూతకముదెల్పి యవలఁ జొనుపు
మునుప్రతిశ్రితముచేసిన పైడి రాకున్న
ముచ్చిచ్చునను వేగు వచ్చుఁదనుక

గీ. వసరు శాకాయ లవణాయవా యటంచు
బెనఁగు ధూళిః పరగృహాదపియను నాస
ముంచి యీఁగకుఁ గాటు పామునకుబలియు
నొసగడని భర్తకై పొక్కు నువిద మదిని
(పాండు 4-149)

యాచనతో దొఱకిన వస్తువులను గోమటిండ్లలో నమ్మించు వాని ప్రతిభకు – మనము నవ్వకుండ నెట్లుండగలము ? ఎట్టి చుట్టమైన నింటికి వచ్చినచో రెండవ సూతకము దెల్పునట! వానికిఁ గూడు వెట్టకయే పంపివేయునట! వచ్చిన చుట్టము పొమ్మన్న మాత్రమునఁ బోవునా ? ఈకాలమున పూటకూటి యిండ్లుగలవు గనుక బలవంతపెట్టి పిలిచినను చుట్టములు మనయిండ్లలో భోజనమునకు నిలుచుట కష్టమైనది. ఆ నాడట్లుగాదు. సుశీలభర్త వంటి వారికి చుట్టమొక దయ్యమే. వారిబారినుండి దప్పుకొనుట కా లోభిచక్రవర్తి చక్కని పన్నుగడ పన్నినాడు. వానికి రెండవసూతకమని చెప్పెడి వాడట! ఇక వాని మైలకూడు గుడుచునంతటి యాచార హీనుఁ డెవఁడుండును? వానిలోభ మంతటితోఁగూడ నాగ లేదు. వాని సొమ్ము పెట్టకున్న మానె. పరుసొమ్ములకుగూడ వా డొక్కప్రొద్దులుండువాడట! "శాకాయ లవణాయవా" యటంచు వసరునట! పరులసొమ్మొక పైసా యైనను కూర గాయలకో కాకున్న ఉప్పునకో యక్కఱకు వచ్చునని వాని బాధ. కడకు వాని పిసినిగొట్టుతనము 'ధూళిః పరగృహాదపి' యను నాస పెనగునంతదూరము పోయినది. పరుల యిండ్ల

నుండి కడకింత దుమ్మువచ్చినను సరే. విడచిపెట్టువాడుగాడు. వా డంతటి యాశపోతు. వానినిజూచి నవ్వకుండుటకు సాధ్యమే గాదు.

లోభివానివలెనే మనకు హాస్యమును గలిగించు పాత్రము సుశీల కథలోనే మఱియొకటి గలదు. సుశీల యొకనాడింటిలో నొంటరిగ నున్నది. ఆకటితో నలమటించు బ్రాహ్మణ బ్రహ్మచారి యొకడామె యింటికి వచ్చినాడు. పాపమా యిల్లాలు వేడియన్నము వండిపెట్టెదనన్నది. కాని బ్రహ్మచారికి కడుపులో నాకటిచిచ్చు నాలుకలు సాచు చున్నది.

> ''వేడియగుదాక నోరువ – మాడుగలిగె
> బులిసినది గల్గె నన్నంబు పోకయంత
> యొసగు''

మన్నాడు. మాడైనను సరే పులిసినదైనను సరే పోకయంత యన్నమును పెట్టుమని యడిగినాడు. వాని తొందరపాటు మాటలతో నాగినదిగాదు. ''పెట్టక పోనని యాకట గొట్ట గిలంబడుచు బడుచు కడచి దురదురజని వేసట్టింట'' గూరు చున్నాడు. 'నీవు పెట్టియేతీరవలెను. నేను తినియే తీర వలెను' అని నట్టింట గూరుచున్న యా పిలువని పేరంట మును జూచి యా సతీమతల్లి యేమనుకున్నదో కాని మనకు మాత్ర మాతని కాలు నిలువని తొందరపాటునకు నవ్వు వచ్చును. అతిథిపూజా తత్పరయైన యా పుణ్యవతి బ్రాహ్మణ బాలునకు – ఉన్నదేమో యాడ్చి వడ్డించినది. తిరిగిచూచు నంతలో నా బ్రదిమ్మరీడు 'సిక్థ మొక్కటియేనియు జిక్కనీక

మిర్రింగి మీదులుచూచుచున్నాఁడు. ఈవిధముగా హాస్య కవితా కళానిధియైన రామలింగని చేతిలో నీ బ్రహ్మచారి నడవడి యంతయు నొక హాస్యరసఖండముగా దయారైనది.

ఇట్లే నిగమశర్మోపాఖ్యానమునఁ గాపు కోడలి ప్రవర్తనముగూడ మనకు నవ్వు బుట్టించును. నిగమశర్మ యొక కాపువానియింటనున్నాఁడు. ఆ కాపు కోడలొక పూపవయసు మిటారి. ఇక నిగమశర్మ సోయగము మనకు దెలిసియే యున్నది. ''చేనంటినగందు కెందళుకులంగమునంగలవాఁడు'' 'మిక్కిలిన్ గంటికి నించువాఁడు.' 'తెలికన్నులవాఁడు'. పైగా నాయింట వాని కావంతయు నడ్డమొక లేదు. స్వైరముగా సంచరింపవచ్చును. ఈ చక్కనయ్య తేనెబూసిన కత్తియని యా కాపువానికిఁ దెలిసియుండినగదా హద్దు పద్దు లేర్పఱచుటకు! కనులయెదుట నడయాడుచున్న యా వన్నెకానిని చూచి యా పల్లెటూరి పిల్లకు కన్ను చెదరినది. చిగురువంటి యామె లేతనువు కామజ్వరపు కాకలతోఁ దూలినది. మోహములు నేర్లై ప్రవహించినవి. మనసున మూగకోరికలు రెక్కలుదట్టినవి. ఇంకేమున్నది? జాణతనము లెఱుగని యా కాపుచిన్నది వెకలిచేష్ట లారంభించినది.

సీ॥ పలు వికారంబుల కలగల్పుచూపుల
రాకపోకలు బయల్ ప్రాకజేయుఁ
దమకంబు గమకంబుఁ దత్తరంబును హత్తి
మనసు నాఁగిన పజ్జఁ జొనుపు గోర్కె
కుదురు పాలిండ్లపైఁ గొంగు జాఱఁగఁ గొప్పు

పీడ నూఱకనవ్వు వెఱ్ఱినవ్వు
నేరాలిపట్టి బిట్టెత్తి చెక్కిలినొవ్వఁ
గఱచి వాఁడేఁచ్చినఁ గౌగిలించు

గీ॥ దండసకి మెడఁ బుంజాల దండఁబెట్టు
దిట్టు మెట్టెలు బిగువంచు దెగి కళాదు
వనిత చిన్నారి పొన్నారి వయసువాని
విప్రనందనుఁ గన్నంత వెకలియగుచు

మనసిచ్చిన మానవతు లందఱు నిట్లు వెకలినవ్వు నవ్వుదురా? వెకలిచేష్టలు సేయుదురా? కొమరుప్రాయపు పొంగులో నున్న యా కాపుకోడలు – ఎవరైన జూతు రేమోయన్న జంకుగాని – బిడియముగాని – లేక విపరీతమైన కామాతు రతను ప్రకటించినది. ఆమె ప్రవర్తనా వైపరీత్య మెంత వఱకుఁ బోయినదో చూడుడు. మెట్టెలు బిఱ్ఱెనవని కంసాలి వానిని దిట్టుచున్నది. ఆమె శరీర మెదుగుచున్నందుకు కంసాలివాఁ డేమిసేయగలఁడు. వానిని దిట్టినచో నామెకు నిండిన దేమి? నిగమశర్మవంటి కోడెకానికి దన్ను గూర్పలేదని "తాకట్ల బ్రహ్మయ్య"నే తిట్టుచున్నట్లు మనకు దోచును. ఆమె యక్కసమును జూచి మనకు పట్టరానంత నవ్వు!

రామలింగని జీవితమే హాస్యమయము. అత డేమాట పలికినను – నందు హాస్యము దప్పక తొంగిచూచుచుండును. ఇతరులలోని తప్పులను – అనగా తప్పులని తనకు దోచిన

వానిని - హాస్యధోరణిలో బయటబెట్టి యందఱను కడుపుబ్బ నవ్వించును. పెద్దనామాత్యు లానాటి కవులలో బెద్ద. ఆయన

క. కలనాటి ధనములక్కఱ
గలనాటికి దాప గమల గర్భునివశమా!
నెలనడిమి నాటివెన్నెల
యలవడునే గాదెబోయ నమవసనిసికిన్.

అని కందపద్యమును వ్రాయగా నందలి 'యమవస నిసి' యన్నమాట రామలింగని చెవికి కటువుగాఁ దట్టినది. అతడు వెంటనే

క. ఉమెతఃకయ దిని సెపితో
క్రమ మెఱుగక వెత్తిపుచ్చకయదిని సెపితో
ఎమిదిని సెపితివి కపితము
అమవసనిసి యన్నమాట అలసని పెదనా?

అని కందపద్యముతోనే వెక్కిరించినాఁడు. పెద్దనామాత్యులపై రామలింగనికిఁ గొండంత గౌరవము. అతఁ డొకచోట పెద్దనామాత్యులనుగూర్చి

క. కవియల్లసాని పెద్దన
కవి తిక్కన సోమయాజి గణుతింపంగా
కవినేను రామకృష్ణుడ
కవియను నామంబు నీటికాకికి లేదే?

అని పెద్దన యెనుట దా నెందుకు బనికిరానివాఁడనని చెప్పికొన్నాఁడు. కాని తనకు సరిపడనిమాట విన్నపుడూకొని బిక్కమొగము పెట్టి చూచుచుండుట రామలింగనికి సాధ్యము గానిపని. పెద్దనామాత్యులుగూడ నా పద్యమును విని విఱుగబడి నవ్వియుందురని నా యూహ. ఆనాటి పెద్దలకా రసికతయుండినది. వా రెంతగంభీరులో - అంత హాస్య ప్రియులు. తమ్మితరులు పరిహసించి తమలోని తప్పులను బయటపెట్టినచోఁ దమతలనున్న బంగరుకిరీటము క్రిందబడు ననుగుండె దిగులు వారికి లేదు. తమ్ము పరిహసించునప్పుడు పదిమందిలోఁ దామొకరై నవ్వుచు పరిహాసకుని హాస్యకుశలతకు మెచ్చుకొనుచుండెడి రసికుల కానాఁడు కొదువలేదు.

ఒకనాఁడు తిరుమలరాయలు రామలింగనితో "నన్ను పరిహసింపుము చూతు" నన్నాఁడట! రామలింగని కింకేమి కావలయును? రొట్టె విఱిగి నేతిలోఁ బడినట్లైనది. 'ఇఁకచూడు నా దెబ్బ' యని మొదలుపెట్టినాఁడు.

కం. అన్నాతిగూడ హరుఁడగు
నన్నాతినిగూడకున్న నసురగురుఁడే
నన్నా తిరుమలరాయఁడు
కన్నొక్కటి లేదుగాని కంతుఁడుగాఁడే.

సామాన్యముగా నంగవైకల్యమును పరిహాస పరికరముగా జేసికొనుట హాస్యమును కుంటుపఱచుటయే. పైగా నది మన్నింపరానిదకూడ. నిజముగా తిరుమలరాయలు పై పద్య

మును విని రామకృష్ణునిపైఁ గోపింపవలసియుండెను. కాని యాతఁడా హాస్యశిల్పమునకు ముగ్ధుఁడై యానందించినాఁడు. అది యాతని హాస్యరసికతకు గురుతు. పై పరిహాసములో నొక విచిత్ర శక్తియున్నది. పద్యము వినినంతనే యెవ్వని కైన నవ్వకుండుటకు శక్యముగాదు. పిమ్మట నాలోచించుకొని కోపమును దెచ్చుకొన్నచో దెచ్చుకొనవచ్చు నంతే. ఇట్టి -- నేఁడు కవిపండితులలో నెందునకైన గానరాని - రసికత యానాటి తెలుఁగు కవులలోమాత్రమే కాదు- సంస్కృత కవి పండితులలో - నంతకంటె నెక్కువగా మనము చూడ వచ్చును. చమత్కారముతోడి హాస్యమున్న జాలును. దాని వెనుక నెంత నిందయున్నను లెక్కసేయక కడుపు చెక్క లగునట్లు నవ్వినవా రనేకులు మనకు గానవత్తురు.

ఒక రాజు కొలువున నన్నిమతములకుఁ జెందిన పండితు లుండిరట. రామానుజ మతమువాఁడు గొంత యాల స్యముగ సభకు వచ్చినాఁడు. అతని నొక ద్వైతవాది "అయ మంత్యజ ఆగతః" అన్నాడట. ఆ పలుకులకు వైష్ణవుఁడు మొగము చిట్లింపలేదు. తానుగూడ చమత్కరించుట కొక యదను దొరకినదని సంతసించినాఁడు. వెంటనే యత డిట్లు బదులు పలికెను. "అహమంత్యజః అయం రాజాప్యంత్యజః ఏష సమాజోప్యం త్యజః. త్వమేవధ్వాంతః" ఆ జవాబువిని యందఱితోఁ బాటు మధ్వ మతస్థుఁడుగూడ నవ్వినాఁడు.

ఇట్టి పరిహాసమునకు జాల ప్రతిభ కావలయును. రసికు లైన వారా ప్రతిభను గుర్తింతు రంతే. దాని వెనుకనున్న

నిందను గమనింపనే గమనింపరు. ఆనాఁటి రసికుల మనస్సుల కంతటి నిండుదనముండినది. పరిహాస ప్రసంగము లేని వాక్యము కొఱగానిదని వారి సిద్ధాంతము.

అన్నిటికంటె నుత్తమోత్తమ హాస్యము మానవ జాతినే పరిహసించునదని మొదటనే మనవి చేసినాను. ఆ హాస్యముగూడ తెనాలి రామలింగని దృష్టిని దప్పించుకొన్నది గాదు. అట్టి హాస్యము నిగమశర్మోపాఖ్యానమున మనకు లభించుచున్నది. నిగమశర్మ దుండగములలో నతనికి-ఊరు-పగయైనది. ఇఁక దనయాట లక్కడ సాగవని యాతఁడు దెలిసికొన్నాఁడు. ఇంటిలోని సొమ్మంతయు దస్కరించి తల్లి దండ్రులను భార్యను విడిచి దేశాంతరమునకు గాలుదీసినాఁడు. వాని యక్కయు బావయు గూడ వాని చౌర్యమునకు గుఱి యైరి. ఉదయమున లేచి చూడగా నింట దోపువోయినది. అప్పుడా యింటివారి చిత్తవృత్తు లెట్లుండెనో చూడుడు.

సీ॥ శోకించు వృద్ధభూసురు డాత్మపితృదత్త
దర్భముద్రికకు చిత్తంబుగలగి
యత్తగారిచ్చిన హరిసుదర్శనపు బే
రునకు ముత్తైదువ వనటబొందు
క్రొత్తగా జేయించుకొన్న ముక్కఱకునై
యడలుఁ దుర్వారయై యాడుబిడ్డ
జామాత వెతబొందు వ్యామోహియై నవ
గ్రహకర్ణవేష్టన భ్రంశమునకు

ఎంతదుర్బుద్ధి యెంతదుర్భ్రాంతియహహ!
సర్వధనముల నద్దురాచారశీలు
డూచముట్టుగ నిలుదోఁచి యుఱికిచనుట
యెఱుగరోగాక యవ్వేళ యెఱుకగలదె?

ఇంటిలోని సొమ్మంతయు నాదుష్టుఁడూడ్చుకొని పోయి నాఁడు. కొండవంటి యాస్తి కర్పూరమువలె మాయమై నందు కొక్కఁడైన నేడ్వలేదు. నలుగురు నాలుగు కారణముల కేడ్చుచున్నారు. వృద్ధభూసురుఁడు దండ్రిదనకిచ్చిన దర్భముద్రిక పోయినదని దుఃఖించినాఁడు. చేతికందిన కొడుకు దేశముల పాలాయెనని యతఁడు వగవనేలేదు. పాపమా తల్లి కిఁగూడ వానిపోకడ శోకము గల్గింపలేదు. ఆపెద్దముత్తైదువ హరిసుదర్శనపుఁ బేరుపోయినదనియే వనట జెందినది. ఇక నిగమశర్మతోఁ బుట్టువు క్రొత్తగఁ జేయించుకొన్న ముక్కఱకై యెంతవారించినను నిలువక వెక్కి వెక్కి యేడ్చినది. ఆయాఁడుబిడ్డ పెనిమిటి తనచెవిపోగులుపోయినవని వెతబొంది నాఁడు. ఇంతటి చిక్కనిహాస్యము మన కావ్యములయందుఁ జాలయఱుదు. వారిప్రవర్తనమును జూచి రామలింగఁడు "ఎంతదుర్బుద్ధి! యెంతదుర్భ్రాంతి! యహహ!" యని నవ్వుచున్నాఁడు. ఈనవ్వు నవ్వుకాదు. ఆపాత్రముల నాతఁడు పొడుచు బాకుపోటులు. ఆ మాటలతో నాతఁడు వారిని వెక్కిరించుచున్నాఁడు. వారిబుద్ధి దుర్బుద్ధియట! వారిభ్రాంతి దుర్భ్రాంతియట! దుర్బుద్ధియెందున్నది.! సర్వనాశనమైనందు కేడ్వక తమతమ వస్తువులకై కుంద

టలోనున్నది. దుర్భ్రాంతియందున్నది. అల్పవస్తువులమీది యభిమానముతో దమసర్వనాశమును గుర్తింప లేకపో వుటలోనున్నది.

ఈహాస్యమత్యుత్తమమని యేల యంటిననగా నిక్కడి పాత్రముల ప్రవర్తనాపై చిత్రికొకవైపు నవ్వుచునేమటియొక వైపు వారి దుర్బుద్ధిని దుర్భ్రాంతిని ఈసడించుచున్నాము గనుక. ఆదుర్బుద్ధిదుర్భ్రాంతు లీపాత్రములకు మాత్రమే యున్నవా ? లోకమున నెవ్వరికిని లేవా? ఎందుకు లేవు? అందరికినున్నవి. దేశకాలముల భేదములేక యందరు మానవులకు నిట్టిగుణములు సహజములు. ఈసత్యమును గుర్తించిన వెంటనే మనలో నొకయాత్మ విమర్శతలయెత్తును. అప్పుడిక మనము నవ్వునదెవ్వరినో చూచికాదు ; మానవజాతిని చూచి, అనగా మనలను మనమేపరిహసించికొనుచున్నామన్నమాట. అందువలననే యిట్టిహాస్య ముత్తమోత్తమమైనది.

ఇట్టిహాస్యమునింకను నతనికావ్యములయందు భావించి యానందింపవచ్చును. కాలము-ఓర్పు-దండిగనుండవలెనంతే.

